Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 37 • 16-9-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-







## సకల జనుల సమ్మెతో...

# చక్రబంధంలో ప్రభుత్వం!

కెసిఆర్ ప్రారంభించిన సకల జనుల సమ్మె రాష్ట్ర ప్రభుత్వానికి అతి పెద్ద సవాలుగా మారింది. ఇప్పటి వరకు తెలంగాణా ఉద్యమాన్ని ఎదుర్కొన్న తీరుకు, ఈ సమ్మెకు చాలా తేడా వుంది. రాజీనామాలు, ఉపఎన్నికలు, భారీ బహిరంగ సభలు, అప్పుడప్పుడు ఒకటి రెండు రోజుల బంద్‌లతో ఇంతకాలం నడిచింది ఉద్యమం. వాటి వల్ల స్వల్ప రాజకీయ సంచలనం, కొంత మేర ప్రజా జీవితానికి ఆటంకం మాత్రమే కలిగేది. ప్రభుత్వం మీద ఒత్తిడి పెరిగేది. కానీ ఇప్పుడు తల పెట్టిన సకల జనుల సమ్మె రాష్ట్ర ప్రభుత్వాన్ని చక్రబంధంలో ఇరికించి వేస్తున్నది. ప్రభుత్వ ఉనికికి, మనుగడకు, సమర్థతకు సవాలుగా పరిణమిస్తున్నది.

రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులందరూ సమ్మె కట్టారు. దానితో తెలంగాణ జిల్లాలలో పౌర పాలన స్తంభించిపోయింది. ప్రభుత్వ ఖజానాకు రావలసిన వందల కోట్ల రూపాయల పన్నుల సొమ్ము నిలిచిపోయింది. వారం పది రోజుల పాటు ఇదే జరిగితే ఖజానా ఖాళీ అవుతుంది. జీతాలకూ తడుముకోవాల్సిన గతి పడుతుంది. మరొకవైపు ఏ ప్రభుత్వ కార్యాలయమూ పని చేయక ప్రజలు తీవ్ర అసౌకర్యానికి లోనౌతున్నారు. ఒక్క కాగితం కదలడం లేదు. వీటన్నిటినీ మించింది – సింగరేణి కార్మికుల పని స్థంభన. వేలాది మంది కార్మికులు పనులు మానేయడం వల్ల బొగ్గు ఉత్పత్తి నిలిచిపోయింది. దానితో విద్యుత్ కేంద్రాలు మూతపడే ప్రమాదం ఏర్పడుతున్నది. వారం రోజుల లోపల సరఫరా జరగకుంటే రాష్ట్రంలో విద్యుత్ దీపం వెలగదు. ఫ్యాక్టరీ యంత్రాలు తిరగవు. రైలు బండ్లు నడవవు. మంచినీళ్లు దొరకవు. 17వతేది నుంచి ఆర్టీసి బస్సు కార్మికులు సమ్మెకు దిగుతారని అంచనా. అదే జరిగితే తెలంగాణాలో జన జీవనం ఎక్కడికక్కడ స్థంభించిపోతుంది. జనం మరికొంచెం ముందడుగు వేసి, రైళ్లను ఆపితే మొత్తం భారత దేశమే ప్రభావితమౌతుంది. ఉత్తర దక్షిణ భారత దేశాల మధ్య సంబంధాలు తెగిపోతాయి. విద్యుత్ విషయంలో మనతోపాటు, తమిళనాడు, కర్నాటక, కేరళ, పాండిచ్చేరి, గోవా రాష్ట్రాలు కూడా ఇబ్బంది పడక తప్పదు. మన రాష్ట్రంలోని రామగుండం, విశాఖపట్నం వంటి ఎన్‌టిపిసి విద్యుత్ కేంద్రాల నుంచి ఆ దక్షిణాది రాష్ట్రాలకు విద్యుత్ సరఫరా జరుగుతుంది. ఇక్కడ ఉత్పత్తి నిలిచిపోతే వారికీ కటకట తప్పదు.

రాష్ట్ర ప్రభుత్వానికి ఇది పెను సవాలు. దీన్ని ఎట్లా ఎదుర్కోవాలో ముఖ్యమంత్రికి బోధ పడడం లేదు. ఎస్మా వంటి కఠిన చట్టాలను ప్రయోగించాలని చూస్తే, ఉద్యోగులు భయపడడం లేదు. మిలిటరి ఇంజనీర్లను పిలిపించి విద్యుత్ కేంద్రాల వరకు నడపవచ్చు. కానీ బొగ్గు ఉత్పత్తి లేనప్పుడు వారు మాత్రం చేయగల్గింది ఏమి వుంది. ఒరిస్సా, జార్ఖండ్, మధ్యప్రదేశ్ వంటి రాష్ట్రాల నుంచి బొగ్గు తెప్పించాలని చూస్తున్నారు కానీ, తమ అవసరాలు మానుకొని మనకు వారు బొగ్గు ఇవ్వకపోవచ్చు. వున్న బొగ్గు నిల్వలను పొదుపుగా వాడుకోవాలంటే, పగటిపూట రాష్ట్రం మొత్తంలో కరెంట్ సరఫరా నిలిపివేయడం ఒక మార్గం. దానివల్ల ప్రజలలో ఎంత కల్లోలం రేగుతుందో వర్ణించలేము. పరిశ్రమలన్నీ మూత పడతాయి. లక్షలాది మంది పనులు కోల్పోతారు. సమాజంలో అశాంతి పుడుతుంది.

అయితే పరిస్థితిని ఇంత భీకర స్థాయికి తీసుకవెళ్లే స్థోమత కెసిఆర్‌కు వుందా అన్నది సందేహం. ఆయన ఒక్కడి వల్ల అయితే అది జరగని పని. కానీ తెలుగుదేశంతోపాటు తెలంగాణ కాంగ్రెస్ నేతలు మొత్తం సమ్మెకు మద్దతు పలుకుతుండడంతో కెసిఆర్‌కు ఎక్కడలేని బలం చేకూరుతున్నది. సమ్మె ఉధృతిని తగ్గించాలంటే, ముందుగా తన పార్టీ నేతలను నియంత్రించడం అవసరం. కానీ ముఖ్యమంత్రి మాట విన్పించుకొనే స్థితిలో వారు లేరు. ఏ మాత్రం సమ్మెకు విరుద్ధంగా ప్రవర్తించినా తమను తెలంగాణా ద్రోహులుగా ముద్ర వేస్తారన్న భయంతో వణికి పోతున్నారు కాంగ్రెస్ నేతలు. విద్యార్థుల పరిస్థితి మరీ ఘోరంగా వుంది. రాష్ట్రంలోని ఒక ప్రాంతంలో మాత్రమే విద్యా సంస్థలు మూతపడితే రేపు 10 తరగతి, ఇంటర్, ఎంసెట్ పరీక్షలలో తాము తతిమా ప్రాంతం వారితో పోటీ పడడం ఎట్లా అన్నది వారి ఆవేదన. పోటీలో తాము వెనక

కొరవ 14వ పేజీలో

## పిలవలేదంటే పరువు తక్కువ

వైఎస్‌జగన్, ఎమ్మార్, గాలి జనార్దనరెడ్డి కేసులన్నిటిలో కలగా పులగంగా ఒకేసారి దర్యాప్తు జరగడంతో హైదరాబాదులోని కంపెనీలన్నిటికీ సిబిఐ శ్రీముఖాలు అందుతున్నాయి. ఎప్పుడెవరికి పిలుపు వస్తుందో ఎవరికీ అర్థం కావడం లేదు. మొదట మొదట పారిశ్రామికులందరికీ సిబిఐ పేరు చెప్తే పగటి పూటే పీడ కలలు వచ్చాయి. నిద్రలో కూడా ఉలిక్కి పడి లేచే పరిస్థితి. కానీ తినగా తినగా వేము తియ్యనైనట్లు, ఇప్పుడు ఆ చలి తీరిపోయింది. దిల్‌కుష్ గెస్ట్ హౌస్‌కు వెళ్లి వచ్చారా అని, అదేదో విహార యాత్ర మాదిరి ఒకరినొకరు ప్రశ్నించుకొంటున్నారు. సిబిఐ నుంచి పిలుపు రాలేదంటే పరువు తక్కువ అన్నట్లుంది పరిస్థితి. పిలుపు రాలేదంటే అర్థం ప్రభుత్వాన్ని దోచే పని ఏదీ చేయలేదని. బొక్కసానికి బొక్కలు పెట్టలేని వాడిని అసమర్థిగా చూస్తున్నాయి పారిశ్రామిక వర్గాలు. గాలిని చూసిన తర్వాత జైలంటే భయం కూడా పోతున్నది వీరిలో. పది మందితో చావు పెళ్లితో సమానమన్నట్లు, అందరూ వెళ్లే చోటుకు తామూ వెళ్లినందు వల్ల ప్రతిష్ట భంగమేమీ వుండక పోవచ్చునన్నదే వీరి ఉపశమన భావానికి కారణం.

## కార్టూన్ స్కేప్





నిన్ను బాదకపోతే, ఆయన నన్ను బాదేలా ఉన్నాడు మరి! ఊ.. పట్టు..! తప్పదు!!

# స్థానికంపై జగన్ ఆశ!

సిబిఐ కేసులు, అరెస్టుల నుంచి తన రాజకీయ భవితవ్యాన్ని, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని కాపాడుకోవాలంటే అత్యవసరంగా స్థానిక సంస్థల ఎన్నికలు జరిగేట్లు చూసుకోవాలని జగన్ భావిస్తున్నట్లు తెలుస్తున్నది. సిబిఐ దర్యాప్తు వల నుంచి తాను తప్పించుకోలేనన్న నిజం జగన్‌కు స్పష్టంగా అర్థమైంది. అరెస్టు, జైలు జీవితం కూడా ఖాయమని తేలిపోయింది. దానివల్ల తన పార్టీ నేతలు, కార్యకర్తలు నైతికంగా నీరసపడి పోతున్నారన్న ఆందోళన జగన్‌ను కలవర పెడుతున్నది. రాజకీయాలలో అది చాలా ప్రమాదకరం. తన మీద ఎంత అభిమానం, మోజు వున్నా జైలుకు వెళ్లి, అవినీతిపరుడిగా ముద్రపడిన తర్వాత జనంలో మార్పు రావచ్చునన్న ప్రచారం ఆయన్ను సతమతం చేస్తున్నది. ఎన్ని ఆరోపణలు వచ్చినా జనం తనతోనే వున్నారని నిరూపించుకొంటే తప్ప ఈ ప్రమాదం నుంచి బయట పడలేమన్న భావనతో వైఎస్‌జగన్ స్థానిక సంస్థల మీద ఆశ పెంచుకొంటున్నాడు. కోర్టు కేసులను సాకుగా చూపించి కిరణ్ సర్కారు స్థానిక సంస్థల ఎన్నికలను వాయిదా వేస్తున్నది. ఈ కేసులను తప్పించి, ఎన్నికలు జరపక తప్పని పరిస్థితి ఏర్పడేట్లు చూడమని తన న్యాయవాదులను కోరాడట జగన్. మూడు నాలుగు నెలల లోపల స్థానిక సంస్థల ఎన్నికలు రప్పించగలిగితే, జనం తనకే ఓటు చేస్తారని, కాంగ్రెస్ మట్టి కొట్టుకొని పోతుందని, దానివల్ల తన పార్టీ రాజకీయంగా కుదురుకోవడంతోపాటు, 2014 వరకు ఆ ఉత్సాహం నిలుపుకొంటే భవిష్యత్తు ముఖ్యమంత్రి తానే అవుతానని జగన్ భావిస్తున్నాడు. ఒకసారి ముఖ్యమంత్రి అయితే కేసులను తప్పించుకోవడం సులభమౌతుందన్నది ఆయన అంచనా.

# కళ్లు తెరుస్తారా?

కోస్తా జిల్లాల రైతాంగం మూకుమ్మడిగా పంట విరామం పాటించడానికి కారణమేమిటో అధ్యయనం చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం నియమించిన మోహన్‌కందా కమిటీ తన నివేదిక సమర్పించింది. పంటకు గిట్టుబాటు ధర ఇవ్వడం ఒక్కటే ఈ సమస్యకు పరిష్కారమని ఒకే ఒక్క మాటలో తేల్చి పారేసింది ఆ కమిటీ. వ్యవసాయం రాను రాను రైతు పాలిట గుదిబండగా మారుతున్నదని ఇటువంటి కమిటీలు ఎన్నో నెత్తీ నోరు బాదుకొని గగ్గోలు పెడుతూనే వున్నాయి. కానీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆ గోడు పట్టడం లేదు. సంస్కరణల పితామహుడిగా కీర్తింపబడే ప్రధాని మన్మోహన్‌సింగ్ ఆర్థిక విధానాలు వ్యవసాయరంగానికి గొడ్డలిపెట్టుగా మారుతున్నాయన్నది బహిరంగ రహస్యం. ఆయన దృష్టి మొత్తం కార్పొరేట్ రంగం ప్రగతి మీదనే కేంద్రీకృతమౌతున్నది. ఆ అభివృద్ధి లెక్కలు చూసుకొని మురిసిపోతూ వుంటాడు. ఆయన ఆర్థిక సంస్కరణల వల్ల దేశం ఎంతో కొంత ప్రగతి సాధించిన మాట నిజమే. ప్రజల జీవన ప్రమాణాలు, స్థూల జాతీయ ఉత్పత్తి పెరిగిన మాట నిజమే. అయితే దాని వల్ల గ్రామాలకు, వ్యవసాయ రంగానికి లాభం కంటే నష్టమే ఎక్కువగా జరిగింది.

జమీన్‌రైతు

గత ఇరవై ఏళ్లుగా వ్యవసాయ రంగంలో ప్రభుత్వ పెట్టుబడులు క్షీణించాయి. పరిశోధనలు లేవు. కొత్త సాంకేతిక పరిజ్ఞాన అన్వేషణ లేదు. ఎరువుల ఫ్యాక్టరీలు పెట్టలేదు. మందులు కనుగొనలేదు. నీటి యాజమాన్యం మార్చలేదు. మార్కెటింగ్ వసతులు పెంచలేదు. ఎగుమతులకు ద్వారాలు తెరవలేదు. ఆహార భద్రత చట్టాలూ మార్చలేదు. కనీసం చాలినన్ని గోడౌన్లు కూడా కట్టలేదు. హరిత విప్లవం నాటి వాసనలతోనే వ్యవసాయం నడుస్తున్నది. దాని ఫలితంగా చైనా, బ్రెజిల్ వంటి దేశాలతో పోలిస్తే మన ఉత్పాదకత సగం కూడా లేని దీనస్థితి నెలకొన్నది.

మద్దతు ధర వాస్తవికంగా వుంటే రైతుకు సమస్య వుండదు. కానీ ప్రభుత్వం ఈ విషయంలో యాంత్రికంగా వ్యవహరించడం అలవాటు చేసుకొన్నది. కేవలం పెట్టుబడి ఖర్చు అంచనాతో మాత్రమే ధర నిర్ణయం చేస్తున్నది. పంట అమ్మితే వచ్చే సొమ్ముతో పెట్టుబడి తిరిగి రాబట్టుకోవడంతో పాటు, రైతు బ్రతకడానికి కూడా కొంత మిగులు వుండాలన్న నిజాన్ని విస్మరిస్తున్నది. కూలీలు, ఎరువులు, తెగుళ్ల మందుల వంటి వాటితో పాటు పెట్టుబడి కోసం తెచ్చుకొన్న అప్పుకు వడ్డీని అసలు పరిగణనలోకి తీసుకోవడం లేదు. కౌలు రైతులకు బ్యాంకులు పంట రుణాలివ్వవు. ఎరువులు, మందుల డీలర్ల నుంచి అప్పు తెచ్చుకోవాలి. వారు వసూలు చేసే వడ్డీ చాలా అధికంగా వుంటుంది. దాన్ని పట్టించుకోవడం లేదు. రైతు కుటుంబంలోని పిల్లల చదువులు, ఆరోగ్యానికయ్యే ఖర్చులు లెక్కించడం లేదు. వీటన్నిటినీ మించింది – కరవులు, తుఫాన్ల వంటి ప్రకృతి వైపరీత్యాల వల్ల కలిగే నష్టం. ఒక పంట నష్టం జరిగితే, దాని నుంచి కోలుకోవడానికి రైతుకు నాలుగైదు పంటల కాలం పడుతున్నది. వీటన్నిటివల్ల ప్రభుత్వం ఇచ్చే మద్దతు ధర రైతు జీవనానికి ఎంతమాత్రం చాలడం లేదు.

ఆహార భద్రత పేరుతో ధాన్యం మీద నియంత్రణ తన చేతిలో వుంచుకొంటున్నది ప్రభుత్వం. ఎగుమతులను స్వేచ్ఛగా అనుమతిస్తే, అంతర్జాతీయ మార్కెట్‌కు అనుగుణంగా రైతుకు గిట్టుబాటు లభిస్తుంది. ఆ హక్కు లేకుండా చేసి, ధర నిర్ణయంలో అన్యాయం చేస్తుండడం వల్లనే రైతులలో వ్యవసాయం అంటే విసుగు, విరక్తి పుడుతున్నాయి. ప్రపంచ ప్రఖ్యాత వ్యవసాయ శాస్త్రవేత్త డాక్టర్ ఎం.ఎస్.స్వామినాథన్ ఈ అంశంపై పరిశోధన జరిపి, పెట్టుబడి ఖర్చుకు కనీసం 50శాతం అదనపు మొత్తం చేర్చి, మద్దతు ధర ప్రకటించాలని ప్రభుత్వానికి సిఫార్సు చేశాడు. కానీ కేంద్ర ప్రభుత్వం ఆ సూచనను ఇంతవరకు పాటించలేదు.

రైతులు పంట విరామం పాటిస్తే దేశం తీవ్రమైన ఆహార సంక్షోభంలో కూరుక పోవడం ఖాయం. పంట లేకుంటే వంట కూడా లేదన్న నిజాన్ని గ్రహించి, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఈ సమస్య పరిష్కారానికి చిత్తశుద్ధితో ఆలోచన చేయవలసిన అవసరం వుంది.

## జనవాణి

### పోలీసు స్టేషన్ల మామూళ్లపై దర్యాప్తు!

గాలి జనార్దనరెడ్డికి చెందిన ఓబుళాపురం గనుల నుంచి త్రవ్విన ఇనుప ఖనిజం కృష్ణపట్నం ఓడరేవు నుంచే విదేశాలకు వెళ్లింది. ఈ సందర్భంగా లారీల క్రింద పడి వందల మంది నెల్లూరీయులు ప్రాణాలు కోల్పోయారు. అయినా అప్పటి పోలీసు అధికారులు కేసులు, పరిహారం విషయమై పెద్దగా పట్టించుకోలేదు. ఆ సమయంలో జిల్లాలోని పోలీసు స్టేషన్లకు ఒక్కో లారీకి నెలకు 70వేలు లంచంగా చెల్లించేవారట. జనార్దనరెడ్డి వ్యవహారాలపై దర్యాప్తు చేస్తున్న సిబిఐ బృందం ఈ విషయంపై కూడా విచారణ చేస్తే లారీల క్రింద పడి ప్రాణాలు కోల్పోయిన వ్యక్తుల ఆత్మలకు శాంతి చేకూరుతుంది.

పి.సుప్రజ — నెల్లూరు

### చిన్న అనుమానం

మనకు స్వాతంత్ర్యం వచ్చాక ఎందరో ముఖ్యమంత్రులు రాష్ట్రాన్ని పరిపాలించారు. కాంగ్రెస్ ముఖ్యమంత్రుల్లో పేరు తెచ్చుకొన్నది దివంగత వైఎస్. రాజశేఖర్‌రెడ్డినే. ఆయన బతికున్న రోజుల్లో తెగపొగిడిన పెద్దలంతా ప్రస్తుతం ఆయన గూర్చి విచిత్రంగా మాట్లాడుతున్నారు. ప్రపంచంలోని ఏ దేశంలోనూ 'ఆరోగ్యశ్రీ' పథకం లేదు. రాజశేఖర్‌రెడ్డికి పేద ప్రజలపై వున్న ప్రేమను వెల్లడించడానికి ఈ ఒక్క పథకం చాలు. స్వాతంత్ర్యం వచ్చాక రాష్ట్రంలో నాగార్జునసాగర్ తప్ప ఒక్క ప్రాజెక్టును కట్టలేకపోయారు. రాజశేఖర్‌రెడ్డి మంచి ఆలోచన చేయబట్టి యిన్ని నీటిపారుదల ప్రాజెక్టులు మొదలయ్యాయి. పనులు జరుగుతున్నాయి. ప్రస్తుతం రాష్ట్రంలో సామాన్యుడి బతుకు దుర్భరమైపోయింది. దీన్ని గూర్చి ఆలోచించే నేతలే లేకుండాపోయారు. పనికిమాలిన రాజకీయాలతోనే పొద్దు పుచ్చుతున్నారు.

పూండ్ల కృష్ణారెడ్డి — నెల్లూరు

### క్షమార్హం కాదు!

పవిత్రమైన దేవాలయం లోనికి పాదరక్షలతో ప్రవేశించినవారు ఎవరైనా, ఏ పదవిలో వున్నా క్షమార్హులు కాదు. ఆర్ష సాంప్రదాయం. భారతీయ సంస్కృతికి ఇటువంటి పనులు గొడ్డలిపెట్టు. హిందువుల మనోభావాలను దెబ్బతీసేలా ప్రవర్తించినవారు జాతికి, ఆలయానికి, భక్తకోటికి క్షమాపణలు చెప్పితీరాలి. పదవులు నేడుంటాయ్... రేపు పోతాయ్. సత్సంప్రదాయాలు శాశ్వతమని మంత్రిణి గల్లా అరుణకుమారి ఇప్పటికైనా గ్రహిస్తే మంచిది.

ప్రొఫెసర్ నాగరాజారావు — హైదరాబాద్

### రాజకీయ కక్ష మానండి!

మాజీ ముఖ్యమంత్రి స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి కాంగ్రెస్ పార్టీకి ఎంతో

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-9-1941
పేజీలు : 10 వెల: అణా

### చెల్లాయపాలెం

శ్రోత్రియందారు గారి తల మనిషి, అందరి సాగుబళ్లకు వదలిన నీళ్లను తమసాగు పూర్తి కానిదే ఇతరులకు వదలము అని చెపుతున్నాడట. ఒకవేళ అధికార ముందని అలా దుర్వినియోగం చేయకూడదండీ!

–ఒక రైతు

### రేబాల బోర్డు

కొత్త ప్రెసిడెంటు వచ్చిన తర్వాత దీపాలు వెలక్కపోవడం, కొందరు నౌకర్లు నిల్చిపోవడం జరిగింది. ఆఫీసు వేరే ఇంట్లో పెట్టారు. ఇంటి బాడుగలని, గుమస్తా జీతాలని ఏమేమో వింటున్నాము. ఓ బ్రదర్! ఈ మూనాళ్ల భోగానికెందుకు అనవసర ప్రసక్తులు. గుట్టుగా వెళ్ల దోసుకోవడం ఉత్తమ లక్షణం.

### నెల్లూరు సత్యాగ్రహుల విడుదల

ఒరుగంటి వెంకటసుబ్బయ్యగారు 9తేది కాకు సుబ్బరామరెడ్డి, కొల్లపనేని వెంకటకృష్ణస్వామి చౌదరి గారలు 17తేది, కొసనా సుందరయ్య 18 తేది విడుదల కాబడిరి.

### మైపాడు సక్కుబాయి

రెడ్డి యువకులు వేసిన నాటకం చప్పగా కాదు చిరు చేదుగా కూడా వుంది. సాలె యువకులు 17తేదీ వేసిన సక్కుబాయి కమ్మగా వుంది. రెడ్డి యువకులకు పెద్దవారి ప్రోత్సాహం, సహకారం రెండూ లేవు. సాలె యువకులకు వారి పెద్దల ప్రోత్సాహం, ఆదరణ, అభిమానం అన్ని వున్నవి. అదే ఐక్యమత్య లక్షణం.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-9-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### లచ్చన్నకు మందసా రాజా పోటీ?

స్వతంత్ర పార్టీ నాయకుడు గౌతులచ్చన్న నియోజకవర్గమైన సోంపేటలో ప్రస్తుతం కాంగ్రెసు అభ్యర్థిగా సూచింపబడుతున్న వ్యక్తి జి.పద్మనాభం. కాని లచ్చన్నకు పద్మనాభం ఏమాత్రం చాలడని, మందసా రాజా అయితే తగిన అభ్యర్థిగా వుంటాడనే ఆలోచనలు ఆంధ్ర కాంగ్రెసు నాయకులలో కలుగుతున్నట్లున్నది. ఈ నియోజకవర్గంలో ఒరియా ఓటర్లు 20వేలు వున్నారట.

### బెర్‌ట్రాండ్ రస్సెల్‌కు శిక్ష

లోకమాన్యుడైన తత్వవేత్త బెర్‌ట్రాండ్ రస్సెల్, వారి సతీమణి అణ్వస్త్రాలకు వ్యతిరేకంగా సత్యాగ్రహం జేశారనే కారణంగా లండన్‌లో అరెస్టు గావింపడి, ముందు మూడు మాసాల శిక్ష విధింపబడి, తర్వాత అది ఒక వారానికి తగ్గించబడింది. రస్సెల్ 89ఏండ్ల వృద్ధుడు. ఈ తత్వవేత్త అరెస్టును, శిక్షను అణ్వస్త్రాల వల్ల లోకం సర్వనాశనం కాగూడదని కోరే నాగరిక ప్రపంచం నిరసిస్తున్నది.

### అల్లూరులో మానవ కంకాళం

అల్లూరులోని ఒక శిథిల గృహ వంట గదిలో కోవూరు తాలుకా మేజిస్ట్రేట్ సమక్షంలో, ఒక మానవ కంకాళం త్రవ్విబయటకు తీయబడిందట. ఈ అస్థిపంజరం ఐదేళ్లనాడు అంతర్థానమైన గుడా వెంకటనరసయ్యదని అనుమానింపబడుతున్నది. ఎముకల గూడు రసాయనిక పరీక్షల నిమిత్తం హైదరాబాద్‌కు పంపారు. వెంకటనరసయ్య భార్య సులోచనమ్మకు, అల్లూరులో మరొక వ్యక్తికి సంబంధమని, వీరివురు కలిసి వెంకట నరసయ్యను హత్యజేసి ఈవిధంగా అతని శవాన్ని పూడ్చిపెట్టి వుంటారని ఊహింపబడుతున్నది.

# నెల్లూరు ముచ్చట్లు

## చంద్రబాబు రాక

మాజీ ముఖ్యమంత్రి, తెలుగుదేశం పార్టీ సర్వాధినేత నారా చంద్రబాబు నాయుడు 20వ తేది నెల్లూరు వస్తున్నారు. మూడు రోజులపాటు ఆయన ఇక్కడే వుంటారు. పార్టీలోని అన్నివర్గాల నాయకులతో చర్చలు, నెల్లూరు, ఆత్మకూరు, ఉదయగిరి, కోవూరు అసెంబ్లీ నియోజకవర్గాలలో పార్టీపరంగా నెలకొన్న పరిస్థితులను చక్కదిద్దేందుకు ప్రయత్నిస్తారు. రాష్ట్రంలోని పార్లమెంటు నియోజకవర్గాల సమీక్షను బాబు నెల్లూరు నుండే మొదలు పెడుతున్నారు. పార్లమెంట్ సభ్యుడు మేకపాటి రాజమోహన్ రెడ్డి రాజీనామా చేయడంతో ఉప ఎన్నిక జరగవచ్చన్న నేపథ్యంలో సమీక్ష ఇక్కడ నుంచే ఆయన ప్రారంభిస్తున్నారు. జిల్లాలో జలయజ్ఞం పనులు, థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులు, సెజ్‌లకు కేటాయించిన భూములు, వాటి బాధితులతో మాట్లాడుతారు. నలుగురు ఎమ్మెల్యేలున్నా నిస్తేజంగా వున్న తెలుగుదేశం పార్టీకి టానిక్ అందించను చంద్రబాబు పర్యటన ఉపయోగపడొచ్చు.

## గాంధీబొమ్మ వద్ద దేడ్‌మార్ పని!

నెల్లూరు గాంధీబొమ్మ వద్ద గత ఒకటిన్నర మాసంగా జరుగుతున్న సిమెంటు రోడ్డు పనులు నాసిరకంగా వున్నాయి. నగరానికి గుండెకాయ వంటి కూడలిలో దేడ్‌మార్ పనులు చేస్తున్నా అడిగే నాథుడేలేడు. ఈ రోడ్డు పనుల పటిష్టత రాబోయే వర్షాకాలంలో తేలిపోతుంది.

## జాయింట్ కలెక్టర్ బదలీ

జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్‌ను 14వ తేది ప్రభుత్వం బదలీ చేసింది. ఈయన్ను తిరుమల తిరుపతి దేవస్థానం జెఇఒగా నియమించారు. 2009 జూన్ నెలలో జాయింట్ కలెక్టర్ నెల్లూరు వచ్చిన సౌరభ్‌గౌర్ తన ప్రత్యేక ముద్ర పడేలా పనిచేయలేక పోయారు. రెవిన్యూ శాఖలో చిన్న ఉద్యోగి సైతం ఆయన పనితీరు, వ్యవహారశైలిపై వ్యతిరేక వ్యాఖ్యలు చేయడం గమనార్హం.

## బాగా పెరిగిన చికెన్!

ఎప్పుడే వస్తువు ధర పెరుగుతుందో చెప్పలేని రోజులివి. గత నెల 11వ తేది కిలో వంద రూపాయలకు దొరుకుతుండిన స్కిన్‌లెస్ చికెన్ ఈ నెల 11వ తేది 154 రూపాయలయ్యింది. బ్రాయిలర్ కోడి మాంసం 132, లేయర్ మాంసం 76 రూపాయలుగా పోస్టల్ కాలనీలోని కోళ్ల మాంసం అభివృద్ధి సంస్థ స్టాల్‌లోనే విక్రయిస్తున్నారు. అయితే ఇక్కడ్ చీటింగ్ జరుగుతుంది. బ్రాయిలర్ మాంసమని లేయర్ల మాంస మిస్తున్నారు. ప్రభుత్వ రంగ సంస్థ స్టాల్‌లో ఇంత మోసమా? సంబంధిత శాఖాధికారులు ఇక్కడ చికెన్‌కొని తిని బాధ్యులపై చర్యలు తీసుకోవాల్సి వుంది.

## పెన్నా బ్రిడ్జిపై పేరుకపోయిన చెత్త

నగరంలో గణేష్ విగ్రహాల నిమజ్జనం జరిగి వారం రోజులు అవుతున్నా నెల్లూరు పెన్నాబ్రిడ్జిపై ఈ సందర్భంగా పడిన పత్రి తదితరాల వ్యర్థాలను తొలగించే తీరిక మునిసిపల్ పారిశుధ్య సిబ్బందికి ఇంకా చిక్కలేదు. ఈ దారిన వెళ్లే ద్విచక్ర వాహనదారులు, పాదచారులు ఇబ్బంది పడుతున్నారు.

## తీరిగ్గా బ్యారేజ్ పనులు

సెప్టెంబర్ నెల రెండో వారం గడుస్తున్నా పెన్నలో బ్యారేజ్ నిర్మాణపు పనులు నత్తనడకన నడుస్తున్నాయి. ఇదే వరుసన పనులు జరిగితే నవంబరు నెలలో పెన్నకు వచ్చే వరదకు ఇప్పటి వరకు జరిగిన పనుల తాలుకు అవశేషాలే మిగులుతాయి. ఇదే నీటి పారుదల శాఖ ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు కావాల్సింది. అందుకే ఈ పనులను తీరిగ్గా చేస్తున్నారు మహానుభావులు.

## సాగునీటి సలహా బోర్డు సమావేశం

సాగునీటి సలహా బోర్డు సమావేశం 23వ తేది నెల్లూరు గోల్డన్ జూబ్లీ హాలులో జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి అధ్యక్షతన జరుగుతుంది. సోమశిల రిజర్వాయర్ నుంచి ఈ సీజన్‌లో వ్యవసాయానికి సాగునీటి సరఫరాపై చర్చ జరుగుతుంది.

## మద్దతు ధరకు ధాన్యాన్ని కొనాలి

జిల్లాలో రైతులు పండించిన ధాన్యానికి పుట్టికి ప్రకటించిన మద్దతు ధర 8,200 రూపాయలకంటే ఏమాత్రం తక్కువకు కొన్నా ఊరుకొనేది లేదని జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ హెచ్చరించారు. తన ఛాంబర్‌లో ఈ విషయమై సమీక్షా సమావేశాన్ని నిర్వహించిన ఆయన మాట్లాడుతూ మిల్లర్లు, దళారులు ఈ వ్యవహారంలో రైతులను మోసం చేయాలని చూస్తే జైలుకు వెళ్లక తప్పదని హెచ్చరించారు.

## నగర డిఎస్పీగా నరసింహ కిషోర్

గత ఆరు నెలలుగా ఖాళీగా వున్న నగర డిఎస్పీ పోస్టును ఎట్టకేలకు భర్తీ చేశారు. నగర డిఎస్పీగా నరసింహ కిషోర్‌ను నియమించారు. ఈయన శ్రీకాకుళం జిల్లావాసి. హైదరాబాద్‌లోని ఇంటెలిజెన్స్ విభాగంలో పనిచేస్తున్న ఈయన్ను నెల్లూరు పోలీసు ఆఫీసులో ఓఎస్‌డి బాధ్యతలతోపాటు నగర డిఎస్పీగా నియమిస్తూ ఉత్తర్వులిచ్చారు. బాధ్యతలు స్వీకరించిన నరసింహ కిషోర్ నగరంలో స్థితిగతులను తెలుసుకొనే పనిలో పడ్డారు.

## జైళ్ల శాఖ ఐజి

జైళ్ల శాఖ ఐజి గోపీనాధ్‌రెడ్డి 8వ తేది నెల్లూరు వచ్చారు. చెముడుగుంటలో నిర్మిస్తున్న ఓపెన్ జైలు పనులను చూసి అసంతృప్తి వ్యక్తం చేశారు. చర్లపల్లి, కడప, విశాఖపట్నంలలో నిర్మించిన జైళ్లను చూసి నెల్లూరు జైలును నిర్మిస్తే బాగుంటుందన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

## రూరల్ డిఎస్పీ బదలీ

నెల్లూరు రూరల్ డిఎస్పీ వి.వి.రవి కుమార్‌కు ప్రమోషన్ ఇస్తూ చిత్తూరు ఓఎస్డీగా బదలీ చేశారు. 2009 నుంచి రూరల్ డిఎస్పీగా పనిచేసిన రవికుమార్ తన విధి నిర్వహణను చక్కగా చేశారు. రెండు నెలలు ఇన్‌ఛార్జ్ నగర డిఎస్పీగా కూడా పనిచేశారాయన.

## వంద కిలోల వెండి స్వాధీనం!

నెల్లూరు రైల్వేస్టేషన్‌లో 9వ తేది తెల్లవారుజామున కేరళ ఎక్స్‌ప్రెస్‌లో దిగిన యువకుల నుంచి 102 కిలోల వెండిని పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. ఈ విషయాన్ని వాణిజ్య పనుల శాఖాధికారులకు తెలపగా బిల్లులు లేకుండా వెండి వస్తువులను సేలం నుంచి నెల్లూరుకు తెచ్చినందుకు రెండు శాతం పన్ను కట్టించుకొని వారిని వదిలేశారు. నెల్లూరు మార్కెట్ నుంచి బంగారు, వెండి వస్తువులు బయట ప్రాంతాలకు వెళ్లడం, బయట నుంచి ఇక్కడకు రావడం మామూలే.

## అల్లూరు కాలేజి ప్రిన్సిపాల్‌కు అవార్డు!

అల్లూరు రామకృష్ణారెడ్డి జూనియర్ కాలేజీని అభివృద్ధి బాటలో నడుపుతున్న ప్రిన్సిపల్ మేడా రామకృష్ణారెడ్డిని గురుపూజోత్సవాన్ని పురస్కరించుకొని ఉత్తమ ప్రిన్సిపల్‌గా ప్రభుత్వం గుర్తించి సన్మానించింది. ఈ యేడాదే ప్రవేశపెట్టిన ఈ అవార్డు అల్లూరు కాలేజికి రావడం గొప్ప విషయం. అల్లూరు కాలేజిలో కామర్స్ విభాగంలో బోధన, ఫలితాల సాధనలో రాష్ట్రంలోనే గత రెండేళ్లుగా ప్రథమ స్థానంలో వుంది. కామర్స్ విభాగంలోని ఒక సెక్షన్‌లో 220 మంది విద్యార్థులున్నారు. రాష్ట్రంలోని ఏ కాలేజిలోనూ కామర్స్ సెక్షన్‌లో ఇంత మంది విద్యార్థులు లేరు. దీనికి కారణం ఆ విభాగంలోని లెక్చరర్లు ఖలీల్ బాష, రామకృష్ణారెడ్డి శ్రమేనని చెప్పక తప్పదు. రామకృష్ణారెడ్డి లౌక్యుడు, స్థానికుడు కావడం వల్ల కాలేజి ప్రహరీ, కొత్తగా పెయింటింగ్, డైనింగ్ హాల్ నిర్మాణం వంటి పనులు జరిగి జిల్లాలోని అన్ని జూనియర్ కాలేజీల్లో కన్నా ఆర్‌కెజెసి కళకళలాడుతుంది.

## ఉచిత హోమియో వైద్యశిబిరం

నెల్లూరు పోలీసు కాలనీలోని వెలమ సంఘం కార్యాలయంలో ప్రతి ఆదివారం ఉచిత హోమియో వైద్య శిబిరం జరుగుతుంది. ఉదయం 9 గంటల నుంచి 11 గంటల వరకు ప్రముఖ హోమియో వైద్యులు డాక్టర్ విద్యాసాగర్ రోగులను పరీక్షించి ఉచితంగా మందులిస్తారు. ఈ అవకాశాన్ని అందరూ వినియోగించుకోమంటున్నారు వెలమ సంఘం నాయకులు.

## అయ్యో.... శ్రీశ్రీ!

ఈ యుగకవిగా అందరిచేత వేనోళ్ల ప్రశంసించబడ్డ మహాకవి శ్రీశ్రీ కుటుంబం పడిన బాధలు ఆయన సతీమణి సరోజనమ్మ చెబుతుంటే కన్నీళ్లు సుడులు తిరగని సాహిత్యాభిమానులు లేరు. శ్రీశ్రీకి పాత మిత్రుడు నెల్లూరు న్యాయవాది వేములపాటి అనంత రామయ్య శ్రీశ్రీ పేరిట ఓ ట్రస్టు పెట్టారు. దీని ప్రారంభోత్సవానికి సరోజ శ్రీశ్రీని పిలిపించారు. ఈ సందర్భంగా ఆమె గుండెలో గూడు కట్టుకొన్న బాధ తన్నుకొచ్చింది. బ్రాహ్మణుడిగా పుట్టడం శ్రీశ్రీ చేసిన నేరమేమో? ఆయన చనిపోయే నాటికి అందరూ చిన్న చిన్న పిల్లలు. వారిని ప్రయోజకులను చేయను చాలా కష్టపడాల్సి వచ్చింది. ప్రభుత్వం ఆ మహాకవి కుటుంబం ఎక్కడుందోనని కూడా విచారించలేదు. ఆయన పేరు చెప్పుకొని ఎందరో సంపాదించుకొన్నారు. శ్రీశ్రీ గారు మాకందించిన సంపద పుస్తకాలేనని చెప్పి ఆమె నయనాలు చెమ్మగిల్లడంతో ఓ మహాకవి కుటుంబానికి చివరికి మిగిలింది ఇదా అన్న బాధతో హృదయాలు బరువెక్కాయి.

## సరస్వతి నిధికి విరాళం

జిల్లా కలెక్టర్ మానసపుత్రిక సరస్వతి నిధికి కలెక్టరేట్ సిబ్బంది తమ ఒక రోజు జీతం 75వేల రూపాయలను విరాళంగా స్వయంగా కలెక్టర్‌కు అందించారు. ఈ కార్యక్రమంలో జెసి సౌరభ్ గౌర్, డిఆర్ఓ రామిరెడ్డి పాల్గొన్నారు.

నెల్లూరు బ్రాహ్మణ మహాసభ నిర్వాహకులు సరస్వతి నిధికి పదివేల రూపాయలు విరాళాన్ని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డిని కలసి అందించారు. ఈ కార్యక్రమంలో మహాసభ నిర్వాహకులు రాళ్లపల్లి రామసుబ్బారావు, డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్ పాల్గొన్నారు.

## సేవాభారతి ప్రతిభా పురస్కారాలు!

గత కొన్నేళ్లుగా పదవ తరగతి పరీక్షల్లో ప్రథములుగా నిలిచే విద్యార్థులకు మంచి పారితోషికాలతో ప్రోత్సాహమందిస్తున్న సేవా భారతి సంస్థ ఈ యేడు అవార్డుల ప్రదానోత్సవాన్ని 23వ తేది నిర్వహిస్తుంది. తోటపల్లిగూడూరు మండలం వరిగొండ జడ్పీ సంస్కృత పాఠశాలలో జరిగే ఈ కార్యక్రమంలో డిఇఒ మువ్వా రామలింగం, నారాయణ మెడికల్ కాలేజి డైరక్టర్ డాక్టర్ జి.సుబ్రహ్మణ్యం ముఖ్య అతిథులుగా పాల్గొంటారని సేవాభారతి నిర్వాహకులు వల్లూరు వెంకట సత్యనారాయణ తెలిపారు.

## ఉచిత కంటి వైద్య శిబిరం

నెల్లూరు మాదరన్ ఐ హాస్పిటల్ అనుబంధ సంస్థ మాదరన్ రెటీనా సెంటర్ ప్రథమ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని 11వ తేది ఉచిత కంటి వైద్య శిబిరాన్ని నిర్వహించింది. 425 మందికి ఉచితంగా కంటి పరీక్షలు చేసి, 173 మందికి శస్త్రచికిత్స చేయాలని తీర్మానించారు. ఈ శిబిరంలో కంటి వైద్యులు పి.ఎల్.రావు, భారతి, గోపాలకృష్ణ, రాజశేఖర్, కృష్ణమూర్తి, శశికళారావు, రమణారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

కొరవ 14వ పేజీలో

# విద్యాశాఖలో ద్విపాత్రాభినయం!

## 24 మండలాల్లో ఎంఇఓలు లేరు



పట్టీపట్టనట్లు డిఇఓ కార్యాలయం.

విద్యాశాఖలో సంబంధిత విభాగాలకు రెగ్యులర్ అధికారులు లేకపోవడంతో విద్యా వ్యవస్థ గాడి తప్పుతోంది. మండల విద్యాశాఖ అధికారులుగా ఇన్‌ఛార్జిలే వున్నారు. జిల్లావ్యాప్తంగా 46 మండలాల్లో 24 మండలాలకు రెగ్యులర్ ఎంఇఓలు లేరు. దీంతో ప్రధానోపాధ్యాయులను మండల విద్యాధికారులుగా నియమించడంతో వీరు ద్విపాత్రాభినయం చేయాల్సి వస్తుంది. పాఠశాలల్లో చదువులు కుంటుపడడంతోపాటు పర్యవేక్షణ కొరవడుతోంది. పాఠశాలల్లో విద్యార్థులకు ప్యాఠ్యాంశాల బోధన సక్రమంగా జరిగేలా చూడడంతోపాటు ఇన్‌ఛార్జీ బాధ్యతలు కూడా పైన పడడంతో ఉపాధ్యాయుల పనితీరు, పాఠశాలల తనిఖీ, రికార్డుల నిర్వహణ, మధ్యాహ్న భోజన పథకంలాంటి బాధ్యతలతోపాటు అదనపు డ్యూటీ చేయాల్సి వస్తుండడంతో ప్రధానోపాధ్యాయులు నలిగి పోతున్నారు. మరోవైపు అసలే అంతంత మాత్రంగా పాఠశాలలకు వచ్చి హాజరు పట్టీలో సంతకం పెట్టి వెళ్లే ప్రధానోపాధ్యాయులను ఇన్‌ఛార్జ్ మండల విద్యాశాఖ అధికారులుగా నియమించడంతో మండలాల్లో చదువుల పరిస్థితి అస్తవ్యస్తంగా తయారౌతోంది. నెల్లూరు డివిజన్‌లో పది మండలాల్లో, కావలి డివిజన్‌లో ఎనిమిది మండలాల్లో, గూడూరు డివిజన్‌లో తొమ్మిది మండలాల్లో ఇన్‌ఛార్జీల పాలన వుండడంతో పాఠశాలలు గాడి తప్పుతున్నాయి. అసలే అంతంత మాత్రంగా సాగుతున్న చదువులు మరింతగా దిగజారిపోతున్నాయి. విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని వివిధ మండలాలకు రెగ్యులర్ మండల విద్యాధికారులను నియమించాలని, అస్తవ్యస్తంగా తయారైన పాఠశాలలను చక్కదిద్దాలని పలువురు విద్యార్థుల తల్లి తండ్రులు కోరుకొంటున్నారు.

# అధికారులపై కలెక్టర్ మండిపాటు!



సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

జిల్లాలో పనిచేస్తున్న అధికారులు తమ వైఖరి మార్చుకోకుంటే కఠిన చర్యలు తీసుకోవాల్సి వస్తుందని జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి సున్నితంగా హెచ్చరికలు జారీ చేశారు. ఇటీవల ఆయన మండల తహాశీల్దార్లు, మండల పరిషత్ అభివృద్ధి అధికారులతో వేర్వేరుగా సమీక్షా సమావేశాలు నిర్వహించారు. మండలస్థాయిలో పనిచేసే అధికారులు తమ దగ్గరకు వివిధ సమస్యలపై వచ్చిన బాధితులను మర్యాదపూర్వకంగా పలకరించి పరిష్కారానికి కృషి చేయాలన్నారు. అలా కాకుండా రకరకాల ప్రశ్నలతో విసిగించి, ఇబ్బందులకు గురిచేయరాదని సూచించారు. ఇప్పటికే పలు సమీక్షా సమావేశాల్లో ఇదే అంశంపై చర్చించడం జరిగిందన్నారు. ఆరోపణలున్న అధికారులు పనితీరును మార్చుకొని ప్రజల సంక్షేమం కోసం కృషి చేయాలని కోరారు. గ్రామీణ ప్రాంతాల్లో ప్రధానంగా భూ సమస్యలు అధికంగా వున్నాయని, వీటిని త్వరితగతిన పరిష్కరించాలన్నారు. మండల పరిషత్ అభివృద్ధి అధికారులు ఉపాధి హామీ పథకం అమలుపై తనిఖీ చేయాలన్నారు. అవకతవకలు జరుగకుండా సంక్షేమ పథకాలు అమలు చేయాల్సిన బాధ్యత వీరిపై వుందని కలెక్టర్ స్పష్టం చేశారు. రెండు సమీక్షా సమావేశాల్లోనూ కలెక్టర్ కొంచం ఘాటుగానే హెచ్చరికలు చేయడంతో అధికారులు ఒకరి మొఖాలు ఒకరు చూసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

# సాగుతున్న... చైన్‌లింక్ స్కీం!

మనీ స్కీంల పేరుతో పుట్టగొడుగుల్లా వివిధ సంస్థలు పుట్టుకొచ్చి పేదల డబ్బును బొక్కేస్తుండడంతో పేద, మధ్యతరగతి కుటుంబాలు విలవిల్లాడుతున్నాయి. ఎస్పీ రమణకుమార్ కఠిన చర్యలు తీసుకొని బాధితులకు న్యాయం చేయాలని చూస్తున్నా కొత్త సంస్థల్లో పెట్టుబడి పెట్టి నష్టపోయిన వారి సంఖ్య రోజురోజుకు అధికమవుతుంది. హిమ్, న్యూవిజన్ ఫౌండేషన్ తదితర సంస్థలలో రెట్టింపు మొత్తాలు వస్తాయని ఆశ చూపడంతో పలువురు ప్రజలు తమ కష్టార్జితాన్ని ఆయా సంస్థల్లో కట్టి లక్షలు వస్తాయని జీవితాలు బాగుపడతాయని ఆశించారు. కానీ పేదల జీవితాలతో ఈ సంస్థలన్నీ ఆటలాడేందుకు ప్రయత్నించడం, కోట్ల రూపాయలు దండుకొని బోర్డు తిప్పేయడంతో ఎస్పీ రమణకుమార్ వీటిపై దాడులు చేయించారు. ఎక్కడికక్కడ పోలీసులు దాడులు జరిపి పెద్ద మొత్తంలో డబ్బులు పట్టుకొన్నారు. బ్యాంకుల్లో ఖాతాలను సీజ్ చేశారు. అయినా కావలిలో రాయల్‌విజన్ అనే సంస్థ ఏకంగా ఏటిఎం కార్డుల ద్వారా నగదు అందజేస్తామని

### కావలిలో తాజాగా టోపీ పెట్టిన మరో సంస్థ

లక్షలు వస్తాయని చెప్పడంతో జనం ఎగబడి కట్టారు. చివరకు ఆ సంస్థ మూటముల్లె సర్దుకొని ఉడాయించడంతో అక్కడా బాధితులు పోలీసులను ఆశ్రయించారు. జిల్లాలో గగ్గోలుగా వుంటూ మరోవైపు పట్టుకొన్న నగదులో 50 లక్షల రూపాయలు స్వాహాచేసి బ్యాగుతో పరారయ్యాడని వెంకటాచలం ఎస్ఐ జీపు డ్రైవర్ విజయ్‌పై ఫిర్యాదులు రావడం, అధికారులు విచారణ చేపట్టడంతో అతను ఆత్మహత్యా ప్రయత్నం చేయడం కలకలం రేపింది. ఎస్పీ రమణకుమార్ మాత్రం ఆర్‌బిఐ అనుమతితో వివిధ ఖాతాల్లోని ఆయా సంస్థల నగదును, పట్టుకొన్న డబ్బును బాధితులకు పంచి పెడతామని హామీ ఇస్తున్నారు. మొత్తంమీద మనీ స్కీం మాయాజాలంలో చిక్కి పేద, మధ్యతరగతి కుటుంబాల ప్రజలు తీవ్రంగా నష్టపోయారు. వీరికి పోలీసులు ఏమాత్రం న్యాయం చేస్తారనేది వేచి చూడాలి.

# పత్తాలేని బూత్‌లెవల్ అధికారులు

## ఓటర్ల జాబితాలు సరిచేసేదెన్నడు?

ఓటరు జాబితాల్లోని అవకతవకలు సరిదిద్దాలన్న లక్ష్యంతో ఎన్నికల సంఘం సమగ్ర సర్వే నిర్వహించాలని ఆదేశించింది. ఇందుకు బూత్ లెవల్ అధికారులను కూడా నియమించడం జరిగింది. ఈ అధికారులు వారి పరిధిలో వున్న ప్రతి ఇంటిని సందర్శించి ఓటు హక్కులేని వారిని గుర్తించి నిర్ణీత ఫారంలో పేర్లు నమోదు చేసుకోవాలి. అంతే కాకుండా ఓటరు జాబితాలో ఒక పేరుకు బదులు మరొకపేరు నమోదు కాబడి వుంటే సవరణలు చేసేలా చర్యలు తీసుకోవాలి. బూత్ లెవల్ అధికారులుగా నియమించిన వారికి ఎన్నికల సంఘం జారీ చేసిన అంశాలపై సరైన అవగాహన లేకుండా పోయింది. గతంలో గ్రామాల్లో పనిచేసే ఉపాధ్యాయులను బూత్ లెవల్ అధికారులుగా నియమించేవారు. ఈ దఫా వీరి స్థానంలో ఇందిర క్రాంతి పథం సిబ్బందిని, అంగన్‌వాడీ వర్కర్లను నియమించారు. వీరితోపాటు విఆర్వో, గ్రామ పంచాయితీ కార్యదర్శులను నియమించడం జరిగింది. అంగన్‌వాడీ వర్కర్లు, ఇందిర క్రాంతి పథం సిబ్బంది ఇంటింటా సర్వే నిర్వహించాలని అధికారులు ఆదేశించారు. దీంతోవారు తమ శాఖ విధులు నిర్వహించలేక, ఓటరు జాబితా సర్వే సక్రమంగా చేయలేక ఇబ్బందులు పడుతున్నారు. ఈ నెల 10వ తేదీలోగా సర్వే జాబితాను అందజేయాలని పేర్కొన్నారు. గడువు ముగియడంతో గతంలో తయారుచేసిన జాబితాలో కొన్ని సవరణలు చేయనున్నారు.

# ఉమ్మడి వ్యూహంతో ఫలితాలు!

ఎర్రచందనం స్మగ్లర్ల ఆటకట్టించేందుకు జిల్లా ఎస్పీ రమణకుమార్ తీసుకొన్న చర్యలు ఫలితాలనిస్తున్నాయి. పేట్రేగిపోతున్న ఎర్రచందనం అక్రమ రవాణాదారులపై పోలీసు, అటవీ శాఖ ఉమ్మడిగా పనిచేసేలా చర్యలు చేపట్టడంతో కొంత మేర ఫలితాలనిస్తుందనేందుకు నెల రోజుల్లో చిక్కిన ఎర్రచందనం ఉదాహరణ. గతంలో ఎన్నడూలేని విధంగా షుమారు 13 టన్నుల ఎర్రచందనాన్ని అటవీ శాఖ, పోలీసు శాఖలు ఉమ్మడిగా పట్టుకొన్నాయి. నలభై మంది వరకు స్మగ్లర్లను

### ఎర్రచందనం స్మగ్లర్లు పట్టుపడుతున్నారు

అరెస్ట్ చేశారు. వెంకటగిరి తదితర అటవీ ప్రాంతాల నుంచి రవాణా అవుతున్న చందనాన్ని అరికట్టేందుకు ఎస్పీ ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేశారు. వెంకటగిరి సిఐ అబ్దుల్ కరీం, కావలి సిఐ శ్రీనివాసన్‌లతో ప్రత్యేక బృందాన్ని ఏర్పాటు చేయడం, అనుమానిత గ్రామాల్లో పోలీస్, అటవీ శాఖ సిబ్బంది గస్తీని ముమ్మరం చేయడంతోపాటు తనిఖీలు విస్తృతంగా చేపడుతున్నారు. ఎర్రచందనం అక్రమ రవాణాలో పేరుగాంచిన వారి జాబితా తయారుచేసిన అధికారులు పాత నేరస్తుల కదిలికలపైనే నిఘా వుంచుతున్నారు. నెల్లూరు, కావలి, వెంకటగిరి, రాపూరు తదితర ప్రాంతాల్లో ఇటీవల జరిపిన దాడుల్లో లక్షల రూపాయలు విలువచేసే ఎర్రచందనం దొరికింది. మొత్తంమీద ఉమ్మడిగా పోలీస్, అటవీశాఖ అధికారులు చేపడుతున్న చర్యలు సత్ఫలితాలను ఇస్తున్నాయి.

# మందుల షాపుల్లో మాయాజాలం

### డూప్లికేటు మందులు విక్రయించేస్తున్నారు

జిల్లాలో మందుల షాపుల నిర్వహణలో పలు అవకతవకలు చోటుచేసుకొంటున్నాయి. ఫార్మసీ కోర్సు పూర్తిచేసిన వాళ్లు మందుల షాపులను నిర్వహించాల్సి వుండగా అధిక భాగం వీటిని అర్హతగల వారు నిర్వహించడం లేదు. ఫార్మసీ కోర్సు చేసిన వారి వద్ద నుంచి సర్టిఫికేట్‌ను కొంత మొత్తం చెల్లించి అద్దెకు తెచ్చుకొని వాటి పేరుతో షాపులను నడుపుతున్న వారిసంఖ్య అధికంగా వున్నట్లు సమాచారం. ఔషద నియంత్రణ శాఖ నిర్దేశించిన ప్రమాణాలను, నిబంధనలను ఏమాత్రం పాటించకుండా ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు కొందరు మందుల వ్యాపారులు. ఇవి కాకుండా ఎలాంటి అనుమతులు లేకుండా ఆస్పత్రులకు అనుబంధంగా ఫార్మసీలను నిర్వహిస్తున్నారు. వైద్యులు నిర్వహిస్తున్న ఇలాంటి వాటిపై అధికారులు తనిఖీలు చేయకపోతుండడంపై పలు విమర్శలు వస్తున్నాయి. అంతేకాకుండా నకిలీ మందులను, వైద్యులకు ఇచ్చే శ్యాంపిల్స్‌ను విక్రయించడం అధికమయ్యింది. రూరల్ ప్రాంతాల్లో గల మందుల షాపుల్లో సైతం ఇలాంటి అవకతవకలు అధికంగా జరుగుతున్నాయి. కంపెనీలు ఇచ్చే శ్యాంపిల్స్‌ను కత్తిరించి శాంపిల్ అని తెలియకుండా అమ్మి సొమ్ము చేసుకొంటున్నారు. ఔషద శాఖ నిషేదించిన మందులను సైతం విక్రయిస్తున్నా సంబంధిత శాఖ అధికారులు పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో ఇటువంటి విక్రయాలు జోరందుకొన్నాయి. అత్యధిక మార్జిన్లు వచ్చే చెత్త మందులను అమ్మేస్తున్నారు కొందరు మందుల షాపుల నిర్వాహకులు. అంతగా మందుల అమ్మకాలు అస్తవ్యస్తంగా జరుగుతున్నా ఔషద నియంత్రణ శాఖ అధికారులు తూతూ మంత్రంగా తనిఖీలు జరిపి చేతులు దులుపుకోవడం తప్ప పటిష్టమైన చర్యలు తీసుకోకపోవడంతో మందుల షాపుల యజమానులు ప్రజలను నిలువు దోపిడీ చేస్తున్నారు.


స్వాగతం! సుస్వాగతం!!
అసామాన్యమైన రాజకీయ చతురత
అనుపమానమైన సేవాజీవితం
అలుపన్నది ఎరుగని పోరాట పటిమ
అరుదైన పరిపాలనాదక్షత, కార్యశీలత
అభరణాలుగా కల్గిన అద్భుత నాయకుడు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాసనసభలో ప్రతిపక్షనేత
తెలుగుదేశంపార్టీ అధ్యక్షులు
శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు
20, 21, 22 తేదీలలో
నెల్లూరు జిల్లా పర్యటనకు విచ్చేస్తున్న
శుభసందర్భముగా వారికి మా హృదయపూర్వక
స్వాగత సుమాంజలి.
బొల్లినేని వెంకటరామారావు
తెలుగుదేశంపార్టీ నాయకులు, ఉదయగిరి
ఉదయగిరి నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు మరియు అభిమానులు



నెల్లూరు పొగతోటలోని మాడరన్ రెటీనా సెంటర్ ప్రథమ వార్షికోత్సవం సందర్భంగా నిర్వహించిన ఉచిత మెగా కంటి వైద్య శిబిరంలో రోగులను పరీక్షిస్తున్న ప్రముఖ కంటి డాక్టర్ భారతి.

# ఉదయగిరి నుంచి పోటీ చేస్తా!

## వంటేరు ముందస్తు ప్రకటన



జిల్లాలో ఉప ఎన్నికలు వస్తే ఉదయగిరి నుంచి శాసనసభకు పోటీ చేయడానికి సిద్ధమని మాజీ శాసనసభ్యుడు, తెలుగుదేశం పార్టీ నేత వంటేరు వేణు గోపాలరెడ్డి ప్రకటించాడు. కావలిలో ఆయన విలేకరులతో మాట్లాడుతూ రాష్ట్రంలో చోటు చేసుకొంటున్న రాజకీయ పరిణామాలతో జిల్లాలో ఉప ఎన్నికలు జరిగే అవకాశం వుందన్నారు. అవే వస్తే ఉదయగిరి నుంచి పోటీ చేయడానికి ఎలాంటి అభ్యంతరం లేదన్నారు. అయితే అధిష్టానం నిర్ణయం శిరోధార్యమన్నారు. వంటేరు ప్రకటనతో కావలి నియోజకవర్గం వంటేరు అనుచరుల్లో చర్చ మొదలైంది. వేణుగోపాలరెడ్డి ఉదయగిరి వెళ్తే తమ పరిస్థితి ఏమిటా అని మధన పడుతున్నారు. ఆయన్ను నమ్ముకొని బీద మస్తాన్‌రావుతో విభేదించి వ్యతిరేకవర్గంగా మసలుతున్నాం. కావలి టిడిపి కార్యాలయం లోను అడుగుపెట్టకుండా ప్రత్యేకంగా వ్యవహరిస్తున్న పరిస్థితుల్లో వంటేరు ఉదయగిరి నుంచి పోటీ అంటే ఏమి చేయాలా అని చర్చించుకొంటున్నారు. వేణు గోపాలరెడ్డి మాత్రం ఉదయగిరి నియోజకవర్గంలో జలదంకి, కలిగిరి, కొండాపురం వుండడం వలన కొంతమేర కలసి వస్తుందని భావిస్తున్నాడు. మొత్తం మీద ఉప ఎన్నికలు వస్తాయో లేదో కాని ఎవరు ఎక్కడ నుంచి ఏ పార్టీ తరపున పోటీ చేస్తారనేది చర్చనీయాంశమయ్యింది.

# లక్షలు దిగమింగిన పోస్ట్‌మాస్టర్!

## ఇసుకపాళెం బిపిఎం పరారీ

బుచ్చిరెడ్డిపాళెం సబ్‌ఆఫీస్ క్రింద గల ఇసుకపాలెం బ్రాంచి పోస్టాఫీసులో డిపాజిట్లను పోస్టుమాస్టర్ స్వాహా చేసిన వ్యవహారం ఆలస్యంగా వెలుగు చూసింది. ఈ బ్రాంచిలో ఎస్‌బి, ఆర్‌డి, ఆర్‌పిఎల్ ఖాతాలు అధికంగా వున్నాయి. ఇక్కడ పనిచేస్తూ పోస్టాఫీసును అభివృద్ధి చేసే బిపిఎం అనారోగ్యంతో మృతి చెందడంతో ఖాళీగా వున్న పోస్టులో సంగం గ్రామానికి చెందిన ఎవి.రమణయ్యను బిపిఎంగా నియమించారు. ఆయన బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి అవకతవకలకు పాల్పడుతున్నాడని గ్రామస్తులు అధికారులకు ఫిర్యాదు చేశారు. విధులకు డుమ్మాకొట్టడం, వచ్చిన జాబులు పంచకుండా చించిపారేయడం చేస్తుండేవాడు. అధికారులు పలు మార్లు హెచ్చరించినా అతనిలో మార్పురాలేదు. ఇటీవల పల్లాప్రోలుకు చెందిన రాఘవ రెడ్డి అనే వ్యక్తి తనకు పోస్టు సక్రమంగా అందడం లేదని ఫిర్యాదు చేశాడు. దీనిపై మెయిల్ వోవర్‌సీర్ విచారణకు రాగానే బ్రాంచి పోస్టుమాస్టర్ పరారయ్యాడు. విచారణ జరుపగా వివిధ ఖాతాల్లోని సొమ్మును దొంగసంతకాలతో దిగమింగేశాడని బయట పడింది. దాదాపు నాలుగులక్షలు గల్లంతయాయట. పోస్టల్ అధికారుల ఉదాశీనత వల్లే బిపిఎం అవకతవకలకు పాల్పడే అవకాశం ఏర్పడిందని, ఫిర్యాదు అందుకున్న వెంటనే క్షుణ్ణంగా విచారణ జరిపి వుంటే ఇలాంటివి జరగకుండా వుండేవని పలు ప్రాంతాల ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు. మొత్తం మీద బిపిఎం చేతివాటం కారణంగా పేద, మధ్యతరగతి ప్రజలు నష్టపోయారు.

# వెంకటగిరి ఘోషా ఆస్పత్రి మూత!

## ● 94 ఏళ్ల చరిత్రగల ఆస్పత్రి!

వెంకటగిరి పట్టణ ప్రజలతోపాటు చుట్టుప్రక్కల గ్రామాలలోని గర్భిణులకు, శిశువులకు వైద్య సేవలు అందించేందుకు ఏర్పాటైన ఘోషా ఆసుపత్రిని ప్రభుత్వం రద్దు చేసింది. కొత్తగా అమలులోకి వచ్చిన క్లస్టర్ విధానంలో భాగంగా అధికారులు ఈ నిర్ణయం తీసుకోవడంతో 94ఏళ్లుగా కొనసాగుతూ వైద్యసేవలు అందిస్తున్న ఈ ఆస్పత్రి మూతబడింది. పట్టణంలోని మరో వైద్యశాలలోకి దీన్ని విలీనం చేస్తారు. ప్రస్తుతం ఇక్కడ బంగారుపేట గ్రామీణ వైద్యశాలను ఏర్పాటు చేశారు. ఘోషా ఆస్పత్రికి 1917 ఫిబ్రవరి 26న అప్పటి మద్రాసు గవర్నర్ లార్డ్ సింట్‌ల్యాండ్ శంకుస్థాపన చేయగా, 1922 నవంబర్ 20న బ్రిటీష్‌రాణి క్వీన్ ఎంప్రెస్ ప్రారంభించారు. అప్పట్లో గర్భిణులకు వైద్య సేవలు అందించేందుకు, శిశు మరణాలు తగ్గించేందుకు ఈ ఆస్పత్రిని ఏర్పాటు చేశారు. అప్పటి రాజా తన తండ్రి పేరున దీనిని ఏర్పాటు చేసి 1966వరకు నిర్వహించారు. అనంతరం ప్రభుత్వానికి అప్పగించారు. అప్పటి నుంచి స్త్రీలకు ప్రత్యేకించి వైద్య సేవలు అందిస్తుండేది. ప్రభుత్వ నిర్ణయంతో ఈ ఆస్పత్రి మూతబడింది. గతంలో ఘోషా ఆస్పత్రి ప్రాంగణంలోనే మాతాశిశు సంరక్షణ ఆరోగ్య సేవా కేంద్రం కూడా నిర్మించి అన్ని వసతులు కల్పించినా అది కూడా మూతబడింది.

# అక్రమ మట్టి త్రవ్వకం - కుల దూషణ కేసు!

## ● కోవూరుపల్లిలో ఉద్రిక్తత

కోవూరుపల్లి చెరువులో అక్రమంగా మట్టిని త్రవ్వడాన్ని అడ్డుకొన్నందుకు స్థానికులపై కులదూషణకు దిగిన కేసులో తెలుగు యువత జిల్లా కార్యదర్శి ఇందుపూరు ధనుంజయరెడ్డిని పోలీసులు అరెస్టు చేసి జైలుకు పంపడం కలకలం రేపింది. చెరువు వద్ద మట్టిని త్రవ్వి తరలిస్తుండడం వలన గుంటలు పడి వర్షాకాలంలో ఇబ్బందులు ఎదురౌతున్నాయని, త్రవ్వకాలు నిలిపివేయాలని ఎస్సీ కాలని వాళ్లు కోరారు. దీనిపై ఇరువురి మధ్య వివాదం నెలకొనింది. మట్టిత్రవ్వకాలను అడ్డగించినందుకు కులం పేరుతో దూషించారని కొందరు కప్పరాళ్ల తిప్ప పోలీస్ స్టేషన్‌లో కేసు పెట్టారు. డిఎస్పీ శ్రీనివాసుల రెడ్డి విచారణ జరిపి ధనుంజయరెడ్డిని నిందితుడిగా పేర్కొన్నారు. ఆయన్ను అరెస్టు చేసేందుకు ప్రయత్నించగా పలుమార్లు రాజకీయ ఒత్తిళ్లు కారణంగా పోలీసులు తటపటాయించినా చివరకు ధనుంజయరెడ్డిని అరెస్టు చేసి కోర్టుకు పెట్టడంతో మేజిస్ట్రేట్ ఆయనకు 15 రోజుల రిమాండ్ విధిస్తూ ఉత్తర్వులు ఇవ్వడం సంచలనం కల్గించింది. కోవూరుపల్లి మాజీ సర్పంచ్ భర్త అయిన ధనుంజయరెడ్డిని అరెస్టు చేయించినందుకు తమకు నీటిసరఫరా నిలిపివేశారని ఎస్సీకాలని ప్రజలు జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్‌కు ఫిర్యాదు చేయడంతో ఆయన తక్షణం స్పందించి నీటి సరఫరాకు ఏర్పాటు చేయాలని స్పెషల్ ఆఫీసర్ అయిన ఎండిఓ భవానీకి ఆదేశాలు జారీ చేశారు.

### భూమిని పొందేందుకు బినామీలు

ఆరోవిడత భూపంపిణీకి అధికారులు సిద్ధమవుతుండగా, మరోవైపు నేతలు తమ వారికి భూములను ఇప్పించుకొనేందుకు బినామీలను రంగంలోకి దించుతుండడంతో గూడూరులో ఇది అబందరగా మారనుంది. భూ పంపిణీకి సర్వం సిద్ధం చేయాలని అధికారులు క్రిందిస్థాయి సిబ్బందికి ఆదేశాలు జారీ చేయడంతో ఇప్పటి నుంచే కొందరు సిబ్బందిని లోబరుచుకొని జాబితాలో బినామీలను చేర్చేందుకు ప్రయత్నాలు ఆరంభించారు రాజకీయ నాయకులు. గూడూరు, నాయుడు పేట, చిట్టమూరు, తడ, దొరవారిసత్రం, పెళ్లకూరు, ఓజిలి మండలాల్లో అక్రమాలకు తెరలేపనున్నాయి. అర్హులైన పేదలను ప్రక్కనపెట్టి బడాబాబుల పేర్లు, గ్రామంలో లేనివారి పేర్లు, రేషన్ కార్డు లేనివారిని, బయటి ప్రాంతాల్లో వుంటున్నవారి పేర్లను జాబితాలో చేర్చేందుకు ముమ్మరంగా ప్రయత్నాలు జరుగుతున్నట్లు సమాచారం. భూస్వాములు పేదల నోరుకొట్టి భూములను బొక్కేందుకు రాజకీయనేతల అండదండలతో తమవంతు ప్రయత్నాలు చేస్తుండడంతోఆరోవిడత భూపంపిణీలోనూ అర్హులకు భూములు దక్కనిపరిస్థితి ఎదురౌతోంది గూడూరు డివిజన్‌లో.

● భూ కేటాయింపుల్లో

# అవకతవకలు!



చిల్లకూరు మండలంలో సెజ్‌లకు కేటాయించిన భూముల్లో పలు అవకతవకలు జరిగాయని, దీనిపై ఉన్నతాధికారులు విచారణ చేపట్టాలని గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ డిమాండ్ చేశారు. మండలంలో పర్యటించిన ఆయన విలేకరులతో మాట్లాడుతూ పేదల భూములను లాక్కొని పెద్దలకు పందారం చేయడంతో వాళ్లు లక్షల రూపాయలకు అమ్ముకొని సొమ్ము చేసుకొంటున్నారన్నారు. ఆర్థిక మండళ్ల పేరుతో పేదల భూములకు ఎకరాకు 35వేల

### గళమెత్తిన బల్లి దుర్గాప్రసాద్

రూపాయలు మాత్రమే చెల్లించి పరిశ్రమల యజమాన్యాలకు అప్పగిస్తే వారు ఇతర సంస్థలకు ఎకరా 10లక్షల రూపాయల లెక్కన అమ్మారని ఇది ఎంత వరకు సమంజసం అని అధికారులను ప్రశ్నించారు. దీనికి నిదర్శనం మాస్ అప్పెరల్ పార్కే అన్నారు. ఈ సంస్థ భూములను నూజివీడు సీడ్స్‌కు విక్రయించిందన్నారు. దీనిపై జిల్లాపరిషత్ సమావేశంలో చర్చించామన్నారు. మాస్ అప్పెరల్ పార్కుకు ఇప్పటికీ అనుమతులు లేవని, అయినప్పటికీ పరిశ్రమ యజమాన్యం పనులు చేస్తున్నట్లు మభ్యపెడుతూ మోసం చేస్తున్నారని ఆరోపించారు. ఇప్పటికైనా జిల్లా అధికారులు ఇలాంటి సంస్థలపై విచారణ జరపాలని లేకపోతే ప్రజల నుంచి నిరసన ఎదురౌతుందని హెచ్చరించారు.




**నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సభ్యత్వ నమోదు ద్వారా వచ్చిన మొత్తాన్ని పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిలకు అందిస్తున్న దృశ్యం.**

# వెంకటగిరి అక్రమ లేఅవుట్లపై దృష్టి!

## మునిసిపల్ డిప్యూటీ డైరక్టర్ వెల్లడి

వెంకటగిరి మునిసిపాలిటీ పరిధిలోని అక్రమ లేఅవుట్లపై ప్రత్యేక దృష్టి సారిస్తామని పురపాలకశాఖ ప్రాంతీయ డిప్యూటి డైరెక్టర్ శ్రీనివాస్ తెలిపారు. ఇటీవల వెంకటగిరికి వచ్చిన ఆయన పట్టణంలో వివిధ ప్రాంతాలలో పర్యటించారు. అక్రమ లేఅవుట్లు వేసిన యాజమానులను పిలిపించి వాటి క్రమబద్ధీకరణకు చర్యలు చేపట్టాలని కమిషనర్‌ను ఆదేశించారు. పట్టణంలో పారిశుధ్యం అధ్వాన్నంగా వుండడంపై మాట్లాడుతూ పారిశుధ్యాన్ని మెరుగుపరచేందుకు అవసరమైతే పొదుపు మహిళా సంఘాల సభ్యులను భాగస్వాములను చేయాలన్నారు. 12వ ఆర్థిక సంఘం నిధులతో చేపట్టిన పనులు పూర్తికావచ్చాయని, 70కోట్లతో నిర్మిస్తున్న సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకు పనులు ఏడాదిలో పూర్తవుతాయన్నారు. ఆర్థిక క్రమశిక్షణకు, రికార్డుల నిర్వహణకు అధిక ప్రాధాన్యమిస్తూ తరచూ తనిఖీలు నిర్వహిస్తున్నామన్నారు. అల్లూరు పంచాయితీకి పురపాలక హోదా కల్పించే అవకాశాలు అధికంగా వున్నాయన్నారు.

# గొలుసుకట్టు పథకంలో ఆత్మకూరు సమిధలు!

తక్కువ పెట్టుబడితో స్వల్పకాలంలోనే లక్షల రూపాయలు సంపాదించవచ్చేనే అత్యాశకుపోయి మనీ సర్క్యులేషన్ ఉచ్చులో చిక్కుకొని విలవిల్లాడుతున్నారు ఆత్మకూరు వాసులు. ఏడాదికాలంగా చాపక్రింద నీరులా సాగుతున్న ఈ స్కీం ఇటీవల జోరందుకొంది. ఆత్మకూరు పట్టణంలో వివిధ రకాల పేర్లతో వెలసిన సంస్థల తరపున ఏజెంట్లు పుట్టుకొచ్చారు. షుమారు వందమందికి పైగా ఏజంట్లు వున్నారంటే ఎంతగా ప్రజలు వీటిని నమ్మి డబ్బులు కట్టారో అర్ధమవుతుంది. ఆగష్టు నెల చివరాఖరులో రెండుకోట్ల రూపాయలు ప్రజల నుంచి ఏజెంట్లు వసూలు చేశారు. ఆత్మకూరు ప్రాంతంలో ఇటీవల మనీస్కీం క్రింద దాదాపు ఇరవైకోట్ల రూపాయలు చేతులు మారినట్లు సమాచారం. అత్యాశకుపోయి పేద, మధ్యతరగతి వర్గాల ప్రజలు పలువురు అధిక సంఖ్యలో డబ్బులు కట్టారు. అప్పులు చేసి, వాహనాలు అమ్మి నగదు చెల్లించిన వారు ఈ సంస్థల బండారం బట్టబయలవడం, పోలీసుల దాడులతో ఇప్పుడు లబోదిబో మంటున్నారు. ఈ సంస్థలు తమ తరపున ప్రజలకు నమ్మకం కలిగేందుకు రాజకీయ నాయకుల భార్యలను, ప్రభుత్వ ఉద్యోగస్తుల భార్యలను, గుర్తింపు కల్గిన వ్యక్తులతోపాటు మహిళలను ఏజంట్లుగా చేర్చుకోవడంతో వారిపై నమ్మకంతో, డబ్బు ఎక్కడికిపోదు మంచి లాభాలు వస్తాయని చెప్పడంతో విచ్చలవిడిగా కట్టారు. కొందరైతే ఏకంగా ప్రామిసరీనోట్లు వ్రాసి ఇచ్చారట నమ్మకం కల్గేందుకు. పలువురు పోలీసులు పెద్ద ఎత్తున వీటిలో సభ్యులుగా చేరి డబ్బులు కట్టి వుండడంతో ఆత్మకూరు ప్రాంతంలో ఈ వ్యవహారం గగ్గోలు రేపుతోంది.

## పెద్ద మొత్తాలు పోగొట్టుకొన్నారు



# బిట్రగుంటపై రైల్వే అధికారుల కక్ష

## ● తనిఖీకో సౌకర్యం రద్దు

ఎవరైనా అధికారులు వస్తున్నారంటే ఏదైనా మేలు జరుగుతుందని సంబంధితశాఖ ఉద్యోగులు, స్థానిక ప్రజలు ఆశపడతారు. కానీ బిట్రగుంట పరిస్థితి మాత్రం అందుకు విరుద్ధంగా వుంది. ఈ ప్రాంతానికి రైల్వే డివిజనల్ మేనేజర్ వస్తున్నాడంటే ఏదో ఒకటి ఎత్తివేసే కార్యక్రమాన్ని అమలు చేస్తున్నట్లేనని చర్చించుకొంటున్నారు. బిట్రగుంట రైల్వేస్టేషన్ అభివృద్ధికి చర్యలు చేపట్టాల్సిందిపోయి వివిధ కార్యాలయాలకు మంగళం పాడడం పనిగా పెట్టుకొన్నట్లు తెలుస్తోంది. ఇప్పటికి రెండు పర్యాయాలు వచ్చిన డివిజనల్ మేనేజర్ మొదటిసారి పర్యటించినప్పుడు రైల్వే హాస్పటల్ ఎత్తివేశాడు. రెండోసారి వచ్చినప్పుడు ప్లాట్‌ఫాం శుభ్రపరిచే స్వీపర్స్‌ను బదలీ చేశారు. దీంతో వున్న హాస్పిటల్ మూతపడి, శుభ్రపరిచే సిబ్బంది లేక అస్తవ్యస్తంగా వుంది పరిస్థితి. ఇక్కడ వుండే రైల్వే డ్రైవర్లను పలువురిని విజయవాడకు బదలీ చేశారు. త్వరలో బిఆర్ఐ ఆఫీస్, సిగ్నల్ డిపార్టుమెంటు ఆఫీస్, ఎల్ఓసి ఆఫీసు ఎత్తి వేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇంత జరుగుతున్నా రోజురోజుకు బిట్రగుంట రైల్వే శాఖ అధ్వాన్నస్థితికి చేరుతున్నా ప్రజాప్రతినిధులుకాని, అధికారులు కాని, రైల్వే ఉద్యోగుల సంఘం కానీ పట్టించుకోకపోవడంతో ఎంతో చరిత్ర గల బిట్రగుంట రైల్వేశాఖ నానాటికి మసకబారుతోంది.

## యువతకు కిరణ్ గాలం



తెలంగాణ ఉద్యమంలో రాష్ట్రం సతమతమవుతున్న పరిస్థితుల్లో యువతరం దృష్టి మళ్లిస్తే పెద్దగా ఇబ్బంది వుండకపోవచ్చని కిరణ్ అభిప్రాయం. తెలంగాణ ఉద్యమంలో విద్యార్థులు, నిరుద్యోగులు ఎక్కువగా పాల్గొంటున్నారని నిఘా వర్గాలు సిఎంకు నివేదించాయి. ఉద్యోగాల పేరుతో యువతను కట్టడి చేయగలిగితే తెలంగాణ ఉద్యమం బలహీనపడుతుందని నిఘా వర్గాల చీఫ్ సిఎం కిరణ్‌కు సూచించాడట. దీంతో ప్రభుత్వ శాఖల్లో ముఖ్యంగా విద్యాశాఖ, పోలీసుశాఖల్లో వున్న వేలాది ఉద్యోగాల్ని భర్తీ చేయడానికి కిరణ్ నడుంకట్టాడు. డిసెంబర్ నెలాఖరు నాటికి లక్షకుపైగా ఉద్యోగాల్ని ఇస్తామని బల్లగుద్దీ చెబుతున్నాడు. దీంతో యువతరం దృష్టి ఖచ్చితంగా ఉద్యోగాలపై పడటం ఖాయంగా కనిపిస్తోంది. ఇతర రాజకీయ పార్టీలకు కిరణ్ నిర్ణయం మింగుడు పడటం లేదు. నిజంగా కిరణ్ లక్షల సంఖ్యలో ఉద్యోగాల్ని ఇవ్వగలిగితే యువతరం మద్దతు పొందడంలో కిరణ్ కృతకృత్యుడవుతాడు. వచ్చే ఎన్నికల్లో (2014) దీని ప్రభావం ఖచ్చితంగా కనిపిస్తుంది. అప్పుడు కిరణ్‌కుమార్‌రెడ్డి రాజకీయంగా లాభపడి కాంగ్రెస్‌కు లబ్ధిచేకూరుతుందని తెలుగుదేశం, టిఆర్ఎస్ పార్టీలు లోలోన కుమిలిపోతున్నాయి. ఆయువుపట్టు పట్టాడని రాజకీయులు మెచ్చుకొంటున్నారు.

## ఆచార్య ఎక్కేగడపా... దిగే గడపా!



ఎమ్మార్ అక్రమాల్లో మొదటి నిందితుడైన సీనియర్ ఐఎఎస్ బిపి ఆచార్య పరిస్థితి ఏం బాగోలేదు. తనను రక్షించమంటూ ఆయన రాజకీయ నాయకుల తలుపుతడుతున్నాడు. ఎక్కేగడపా! దిగే గడపలా వుంది ఆయన దినకృత్యం. ఎమ్మార్ కేటాయింపుల్లో తను నిమిత్తమాత్రుడి నేనని, అసలు పెద్దలు వేరే వున్నారంటూ ఆయ తనగోడు వెళ్లబోసుకుంటున్నాడట. ఎలాగైనా పలుకుబడి ఉపయోగించి ఎసిబి కేసు నుంచి తనను బయట వేయాలని దీనంగా మొరపెట్టుకుంటున్నట్లు భోగట్టా! అయితే కోర్టు ఆదేశాల ద్వారా జరుగుతున్న విచారణలో తాము జోక్యం చేసుకోవడం కుదిరే పని కాదంటూ రాజకీయులు సానుభూతితో సరిపెట్టున్నారట. దీంతో ఆచార్య ఏం చేయాలో పాలుబోక ముఖం చాటేస్తున్నాడట. పాపం! ఆచార్య!!

## తెలుగుదేశంకు బాలయ్య గ్లామర్



తెలుగుదేశం తెరపైకి బాలకృష్ణ వచ్చేశాడు. వచ్చే ఎన్నికల్లో ఎమ్మెల్యేగా పోటీ చేయనున్నట్లు మనసులో మాట బయట పెట్టాడు. గత రెండు ఎన్నికల నుంచి ప్రతిపక్షానికే పరిమితమై కళావిహీనంగా తయారైన తెలుగుదేశంకు బాలకృష్ణ వెండితెర గ్లామర్‌ను అద్దుతాడని ఆ పార్టీ వర్గాలు నమ్ముతున్నాయి. చంద్రబాబు ప్రభావం రోజురోజుకు తగ్గుతుండటంతో వచ్చే ఎన్నికల్లో ఎన్టీఆర్ వారసుల్ని తెరపైకి తేవాలన్న ఒత్తిడి ఎక్కువైంది. పార్టీలో ఒక వర్గం జూనియర్ ఎన్టీఆర్‌పై మొగ్గుచూపుతుండగా... చంద్రబాబు మాత్రం తన సొంత బావ అయిన బాలకృష్ణకు మద్దతునిస్తున్నాడు. జూనియర్ కంటే బాలకృష్ణ అయితేనే తన అదుపాజ్ఞల్లో ఉంటాడన్నది 'బాబు' అభిప్రాయంగా వుంది. జూనియర్ తన తండ్రి హరికృష్ణ చెప్పుచేతల్లో వుండటం బాబుకు కష్టంగా వుంది. హరికృష్ణ బహిరంగంగానే 'బాబు'ను వ్యతిరేకించడం జూనియర్‌కు 'మైనస్' అయ్యింది. అయితే పార్టీలో మెజారిటీ వర్గం ఇప్పటికీ జూనియర్‌కే ఓటేస్తున్నారు. చూద్దాం... బాబాయి– అబ్బాయిల్లో ఎవరు తెలుగుదేశంను గట్టెక్కిస్తారో...!!

## చీఫ్ సెక్రటరీపై సిగపట్లు



చీఫ్ సెక్రటరీ ఎస్.వి.ప్రసాద్ ఈనెలాఖరుకు పదవీవిరమణ చేస్తున్నాడు. దీంతో కొత్త సిఎస్ ఎవరన్న దానిపై ఉత్కంఠ నెలకొంది. ఎస్వీనే మరో ఆర్నెల్లు సిఎస్‌గా సర్వీసు పొడిగించాలన్న వాదన కూడా తెరపై వచ్చింది. అయితే సిఎస్‌గా కొనసాగడానికి ఎస్వీ సుముఖంగా లేదు. ప్రస్తుతం ఖాళీగా వున్న విజిలెన్స్ కమిషనర్ పదవిని ఇవ్వాలని కోరుతున్నాడు. దీనికి సిఎం కిరణ్ ఇప్పటికే పచ్చజెండా ఊపినట్లు సమాచారం. కాగా కొత్త చీఫ్ ఎవరన్న దానిపై ఐఎఎస్ వర్గాలు సిగపట్లు పడుతున్నాయి. సిఎస్ పదవి సిఎం ఇష్టాఇష్టాలపై ఆధారపడివుంటుంది. సీనియారిటీని పరిగణలోకి తీసుకొనే అవకాశం లేనేలేదు. ప్రస్తుతం స్పెషల్ సిఎస్‌లుగా వున్నవారు అరడజను మంది వున్నారు. వీరిలో ఒకరికి సిఎస్‌గా అదృష్టం వరిస్తుంది. ఇందులో ప్రస్తుతం సిఎం పేషీలో వున్న జె.సత్యనారాయణ ముందు వరసలో వున్నాడు. కమిషనర్ ల్యాండ్ రెవెన్యూగా వున్న పంకజ్ ద్వివేదీ కూడా సీరియస్‌గా ప్రయత్నిస్తున్నాడు. ద్వివేదీ యు.పి.లో కాంగ్రెస్‌లో రాజకీయ కుటుంబానికి చెందిన వాడు. ఆయనభార్య ప్రస్తుతం కాంగ్రెస్ ఎమ్మెల్యేగా వుంది. కాబట్టి ఢిల్లీ పెద్దల సహకారంతో సిఎస్ పదవిని కొట్టేయ్యాలని ద్వివేది శతవిధాలా పోరాడుతున్నాడు. అయితే ద్వివేదీపై లంచగొండి అన్న కొండి వుంది. కాగా మిన్నీ మ్యాథ్యూస్‌కు ఆమె రాష్ట్రం నుంచి ప్రాతినిధ్యం వహిస్తున్న చిదంబరం ఆశీస్సులున్నాయట. కాని కిరణ్ ఎవరిపట్ల మొగ్గుచూపుతాడో చూడాలి.

ట్రంకు రోడ్డు కబుర్లు

## చీర కనపడితే కట్టాల్సిందే...



అతివలకు చీరలంటే మక్కువ. సరికొత్త చీరలు చూస్తే వారి మనసు కొట్టుక లాడుతుంది. దాన్ని ఏదో ఒక విధంగా కొని ధరించనిదే వారి మనసు ఊరుకోదు. మహిళల సంగతి ఇలా వుంటే నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి వ్యవహార సరళి ఇంకో రకంగా వుంటుంది. నగరంలో ఏ షాపింగ్ మాల్, బట్టల అంగడి, బంగారు దుకాణాలు ప్రారంభోత్సవం జరిగినా వివేకానందరెడ్డినే పిలుస్తారు. మిగతా షోరూంల ప్రారంభోత్సవాలకు వెళ్లినప్పుడు స్కూటర్ ఎక్కో, కంఠహారం ధరించో ఆయన ఫోజులిస్తాడు. బట్టల అంగళ్లకు పోయినప్పుడు మాత్రం అందంగా కనపడే చీరను అతివల్లా చుట్టుకొని ఫోటోలకు దిగుతాడాయన. ఈ వారంలో ఇందిరా భవన్‌లో ఏర్పాటుచేసిన చేనేత ఎగ్జిబిషన్‌కు వెళ్లిన ఆయన ఏరికోరి అందమైన పట్టుచీరను బయటతీసి దాన్ని అతివలా అలంకరించుకొని గారాలకు దిగారు. వివేకా ఏం చేసినా చెల్లుతుంది.... అంతే!

## గొలుసు కట్టు... కనికట్టు!



చైన్ లింక్ స్కీమ్ అదే గొలుసుకట్టు పథకం మాయలో పడి సింహపురి ప్రజలు నిండా మునిగారు. ఒకరికి తెలియకుండా మరొకరు ఇలా 50వేల మంది 600 కోట్ల రూపాయలు ముందు వెనుక ఆలోచించకుండా కట్టేశారు. కొంప మునిగాక నెల్లూరు రూరల్ పోలీసుస్టేషన్‌లో ఏర్పాటుచేసిన ప్రత్యేక సెల్‌లో ఫిర్యాదుల మీద ఫిర్యాదులిస్తూ నెత్తి నోరు బాదుకొంటున్నారు. 12వేల రూపాయలు కడితే ఆరు నెలల తిరిగే లోపల లక్ష రూపాయలు వస్తాయని గుడ్డిగా నమ్మారు. మొదట మొదట ఈ మొత్తాన్ని కట్టిన వారికి లక్ష రూపాయలు రావడంతో కనికట్టుకు లోనయ్యారు. ట్రంకురోడ్డే కాదు ఏ సెంటర్‌లో చూసినా గొలుసుకట్టు బాధితుల కథలు కాదు వ్యథలతో మార్మోగుతోంది.

## గాలి మయం!




వైఎస్ జగన్ ఆస్తులపై సిబిఐ దాడులు, ఆ తర్వాత అన్నా హజారే నిరసన దీక్షల గూర్చి అదే పనిగా చర్చించుకొన్న జనాలకు కొత్త విషయం దొరికింది. అదే ఓబుళాపురం గనుల అధినేత గాలి జనార్దనరెడ్డి అరెస్ట్. నాటకీయ ఫక్కీలో జరిగిన ఈ అరెస్ట్‌పై ట్రంకురోడ్డులో ఎడతెగని చర్చలు జరుగు తుండగా ఆయన ఇంట్లో దొరికిన స్వర్ణ తాపడ సింహాసనం, వజ్ర వైఢూర్యాలు, రత్న మాణిక్యాలు, ప్లాటినం నగలు, స్వర్ణ కలశాలు, బంగారు పళ్లాలు, గోమేధికా మణుల హారాలు అబ్బురపరుస్తున్నాయి. బ్రిటీష్ రాణులు, నిజాం నవాబుల సంపద.... సామాన్యుడుగా బతుకు ప్రారంభించి అస మాన్యుడుగా ఎదిగిన 'గాలి' ముందు బలాదూరే కదా అంటున్నారు.

## దింపుడు కళ్లెం ఆశ...



నెల్లూరు నగరంలోని ప్రైవేటు స్కూళ్ల యాజమాన్యాల మధ్య పొడ గిట్టడం లేదు. ప్రభుత్వ గుర్తింపులేని పాఠశాలలను మూసి వేయించాలని పెద్ద వుద్యమమే చేశారు. పరస్పరం దాడులకు తెగబడ్డారు. డిఇఓగా రామలింగం బాధ్యతలు స్వీకరించాక ఈ ఉద్యమ వేడిని తగ్గించారు. రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి కంటి చూపుతో హెచ్చరించడంతో ఈ మధ్య గమ్మునుండిన ఓ వర్గం స్కూళ్ల యాజమాన్యాలు ఈ వారంలో గుంటూరు వెళ్లి ఆర్జేడిని కలిసి నెల్లూరు స్కూళ్ల వ్యవహారం గెలికి రావడంతో మళ్లీ ఈ విషయం ఏ మలుపు తిరుగుతుందోనన్న చర్చ ట్రంకురోడ్డులో జరుగుతోంది.

# వందల కోట్ల చెరువు గుటకాయస్వాహా!

- కనుపర్తిపాడు కబ్జా ఘోరం.
- బాబాయి దురాక్రమణ అబ్బాయి బయట పెట్టాడు.
- కలెక్టర్ ఉత్తర్వులు తాటాకు చప్పళ్లే.
- ఎమ్మెల్యే సువర్ణహస్తం అధికారులను వణికిస్తున్నది.

భూ కబ్జాలకు ఒకప్పుడు హైదరాబాద్ నగరం పెట్టింది పేరుగా వుండేది. ఖాళీ స్థలం కనపడితే చాలు క్షణాలలో కబ్జా చేసే ముఠాల నైపుణ్యం గురించి కథలు కథలుగా ప్రచారం జరిగేది. కానీ మహా ఘనత వహించిన నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి పుణ్యమా అని ఆ ఘనకీర్తి ఇప్పుడు నెల్లూరు నగరానికి కూడా దక్కుతున్నది. ప్రభుత్వ పొలం, ప్రైవేట్ స్థలం కాదేదీ కబ్జాకు అనర్హం అన్న సూత్రాన్ని తుచ తప్పక పాటింప చేస్తున్నాడు వివేకానందరెడ్డి. నాలుగైదేళ్ల నుంచి ఆయనకు ఇదే వ్యాపకం, ఇదే వ్యాపారం. దురాక్రమణదారులు, కబ్జాకోరులతోనే సహవాసం. ఆలీబాబా నలభై దొంగల వలె వివేకానందరెడ్డి వద్ద ఈ తరహా భూ బకాసురుల ముఠా ఒకటి వుంది. ఒక్కొక్కరికి ఒక్కొక్క ప్రాంతం పట్టా వ్రాసి ఇచ్చేశాడు.



బాబాయి అవినీతి బట్టబయలు చేసిన అబ్బాయ్.

కన్పడిన జాగాలన్నిటిలో వారు పాగా వేయడం, అధికారుల నుంచి వారికి చింతాకంత చేటు కలగకుండా ఈయన రక్షణ కల్పించడం... ఇదీ వరస. వివేకా నోరంటే జిల్లా అధికారులందరికీ ఒళ్లంతా కంపరం. అది మునిసిపల్ చెత్త తొట్టికంటే హీనం కావడంతో ఆ గబ్బు భరించడం కంటే ఆయన అకృత్యాలను అనుమతించడమే నయమనే తీర్మానానికి వచ్చేశారు అధికారులందరూ. జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్, ఆర్డీఓ, ఎమ్మార్వో, మునిసిపల్ కమిషనర్ హోదా ఏదైనా వారు చేస్తున్నది ఆనం సోదరులకు వూడిగం మాత్రమే. దానితో కబ్జాకోరులు రోజు రోజుకూ పెట్రేగి పోతున్నారు. నెల్లూరు నగరాన్ని ఆటవిక ప్రదేశంగా మార్చిపారేస్తున్నారు.

ఈ ఆక్రమణ పరంపరలో తాజా ఉదంతం – కనుపర్తిపాడు చెరువు గుటకాయస్వాహా. కొత్త బైపాస్ రోడ్డు నుంచి గొలగమూడి రోడ్డులోకి ప్రవేశించే మొదలులో వుండే చెరువు. మొత్తం విస్తీర్ణం 26 ఎకరాల 43 సెంట్లు. ఆ ప్రాంతంలో ఎకరా ధర ఐదు కోట్లకు పైమాటే. అంటే కూటినీళ్లకు అమ్మినా వంద కోట్ల రూపాయలకు పైగా వస్తాయన్న మాట. అంత ఖరీదైన స్థలం ఖాళీగా వుంటే వివేకానంద రెడ్డికి నిద్ర ఎట్లా పడుతుంది పాపం? తన భూఆక్రమణల ముఠాలో కీలక స్థానంలో వున్న బాల చంద్రారెడ్డి అనే రియల్ ఎస్టేట్ వ్యాపారిని ముగ్గులోకి దింపాడు. బాలచంద్రారెడ్డికి, వివేకాకు పూర్వాశ్రమంలో దగ్గరి వ్యాపార సంబంధాలున్నాయి. దేముడి సొత్తు అనే పాప భీతి కూడా లేకుండా ఆదిత్యనగర్‌లోని వేణుగోపాలస్వామి దేవస్థానం భూములను చిల్లిగవ్వ పెట్టుబడి లేకుండా బాల చంద్రారెడ్డి స్వాధీనం చేసుకోవడానికి వివేకా తన సంపూర్ణ సహకారం అందించిన చరిత్ర వుంది. ఆ లావాదేవీతో బాగా నమ్మకం కుదిరినందువల్లనే కాబోలు ఇంత భారీ భూఆక్రమణకు ఆయనకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు.

సాక్షాత్తు ఎమ్మెల్యే పచ్చ జెండా వూపిన తర్వాత ఇక అడ్డు ఆపు ఏమి వుంటుంది? బాల చంద్రారెడ్డి అక్కడ రియల్ ఎస్టేట్ జెండాలు పాతేశాడు. చెరువు గుంటలు పూడ్చి, చదును చేసి, ప్లాట్లుగా విభజించి, అమ్మకం మొదలు పెట్టాడు. ఈ దశలో కొత్తగా వైఎస్ఆర్ కాంగ్రెస్ తీర్థం పుచ్చుకొన్న పాత పిఆర్‌పి నేత ఆనం వెంకట రమణారెడ్డి కళ్లు దాని మీద పడ్డాయి. తన బాబాయి ఆక్రమణలను ఎండగట్టడమే రమణారెడ్డి రాజకీయ కార్యకలాపం. ఆ రకంగా ఆయన నెల్లూరు నగర పౌరులకు ఉపయోగపడుతూ వుంటాడు. రమణారెడ్డి ఎమ్మార్వో ఆఫీసుకు వెళ్లి కాగితాలు వెతికితే, రెవిన్యూ రికార్డుల ప్రకారం ఈ స్థలం చెరువు అని తేలింది. ఆ మేరకు ఆయన విఆర్వో నుంచి సర్టిఫైడ్ అడంగల్, ఎమ్మార్వో నుంచి రీసర్వే రిజిష్టర్ పత్రం తీసుకొన్నాడు. ఆ రెండింటినీ కలిపి ఈ స్థల దురాక్రమణ ఆపమని జిల్లా కలెక్టర్‌కు వినతి పత్రం ఇచ్చాడు. దానిపై కలెక్టర్ గారు వెంటనే స్పందించి ఆర్డీఓను, ఎమ్మార్వోను పిలిపించి, దురాక్రమణదారులపై క్రిమినల్ కేసులు పెట్టమని ఆదేశించాడు. అది చెరువు స్థలమని, ప్రభుత్వానికి చెందినదని బోర్డు పెట్టమని కూడా వుత్తర్వు చేశాడు.

ఇంతవరకు బాగానే వుంది. కానీ కలెక్టర్ గారికి తెలియని విషయం – ఈ దురాక్రమణ సాధారణ రియల్ ఎస్టేట్ వ్యాపారులు చేసింది కాదని, దీని వెనుక ఎమ్మెల్యే గారి సువర్ణ హస్తాలున్నాయన్న నిజం. దానితో కలెక్టర్‌గారి ఉత్తర్వులు, ఆదేశాలు వుత్తిత్తి తాటాకు చప్పుళ్లయి పోయాయి. ఆర్డీఓ, ఎమ్మార్వోలకు ఎమ్మెల్యే అంటే వణుకు కానీ, కలెక్టర్‌ను చూస్తే భయమెక్కడిది? వారు కేసులూ పెట్టలేదు, బోర్డులూ బిగించలేదు. అంత రచ్చ జరిగిన తర్వాత కూడా ఆ భూమి ఆ రియల్ ఎస్టేట్ వ్యాపారి స్వాధీనంలోనే వుంది.



కనుపర్తిపాడు చెరువును ఆక్రమించి లేఅవుట్ వేశారిలా.

రెవిన్యూ రికార్డులలో స్పష్టంగా వున్న ప్రభుత్వ చెరువు భూమిని అంత పబ్లిగ్గా ఎట్లా ప్లాట్లు చేస్తున్నావు మహాశయా అని దాని ఆక్రమణదారు బాల చంద్రారెడ్డిని అడిగితే – నేను ఆక్రమించలేదు, అంతకు క్రితమే ఆక్రమించినవారి నుంచి కొన్నానని సెలవిచ్చాడు. ఆయన చెప్పేదాని ప్రకారం – నెల్లూరు సంపన్నుల జాబితా వ్రాస్తే మొదటి పంక్తిలో నిలవ గలిగిన కుబేరుడు బి.కుమారస్వామి రెడ్డి వద్ద నుంచి ఈ భూమి కొనుగోలు చేశానని చెప్తున్నాడు బాలచంద్రారెడ్డి. అయితే కుమారస్వామి రెడ్డికి ఆ భూమి ఎట్లా వచ్చిందో తెలియదు. ఆయన్ను అడిగితే నేను చెప్పనుగాక చెప్పను పొమ్మన్నాడు. ఏమి మాట్లాడితే ఏ నిజాలు బయటకు వస్తాయో అని

కొరవ 14వ పేజీలో

# వారఫలాలు

తేది 17-9-2011 నుండి 23-9-2011 వరకు సింహ, కన్యల్లో రవి, బుధులు; కన్యల్లో శుక్రుడు; మేషంలో గురువు; కర్కాటకంలో కుజుడు; వృషభంలో కేతువు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; మేష, వృషభ, మిథున, కర్కాటకాల్లో చంద్రుడు సంచరిస్తారు.


**మేషం** అశ్విని, భరణి, కృత్తిక 1 పా

కుటుంబ సభ్యుల మధ్య మంచి అవగాహన ఉంటుంది. సోదర వర్గంతో సత్సంబంధాలు వుంటాయి. అనుకూల వాతావరణం. మీ వున్నతిని చూడలేక దురాలోచనలు చేసేవారికి గట్టి సమాధానమిస్తారు. సంతానం లేదా ఇంట్లోని పెద్దల ఆరోగ్య విషయంలో ఒకింత ఆందోళన చెందుతారు. ఉద్యోగ, వ్యాపారాల్లో అవాంతరాలు ఎదురైనా లాభాలు వస్తాయి. ఇతరుల విషయాలలో జోక్యం చేసుకోవద్దు.


**వృషభం** కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

నూతన వస్త్రాభరణ లాభాలు. అధిక ధన వ్యయం. వృత్తివ్యాపారాల్లో శ్రద్ధాసక్తులు కలిగి వుంటారు. వృత్తి వర్గాల వారికి యోగదాయకమైన సమయం. ఆత్మవిశ్వాసం అధికంగా వుంటుంది. ఊహించిన రీతిలో ధనాదాయం వుంటుంది. ప్రతినియమాల వైపు మనసు పోనిస్తారు. ప్రయాణాలు లాభిస్తాయి. ఇంటిలో సుఖసంతోషాలు నెలకొంటాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది.


**మిథునం** మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

తల్లి ఆరోగ్యం జాగ్రత్త. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేతమౌతాయి. సంతాన విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదం వుంది. వారాంతంలో నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. సోదరుల మూలంగా ఖర్చు.


**కర్కాటకం** పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే.


**సింహం** మఖ, పుబ్బ ఉత్తర 1 పా

తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు. చిరకాలంగా ఉన్న సమస్యలు ఈ వారం పరిష్కారమయ్యే సూచనలున్నాయి.


**కన్య** ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

విద్యార్థులకు మంచి కాలం. గతంలో చేసిన తప్పిదాలను, విశ్లేషించుకొనే పనిలో పడుతారు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు. ఆహార సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, అనుకూల ప్రయాణాలు, బంధుమిత్రుల కలయికతో ఉల్లాసంగా వుంటారు. క్రయవిక్రయాలు మీకనుకూలంగా జరుగుతాయి. కళాకారులకు, ప్రముఖులకు శుభ వార్తలు అందుతాయి.


**తుల** చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

శుభకార్యాలకు వెచ్చిస్తారు. మూర్ఖపు పట్టుదల పనికిరాదు. దైవ పూజా కార్యక్రమాలలో పాలుపంచుకొంటారు. శ్రమకు రెట్టింపు పేరు ప్రతిష్ఠలు వస్తాయి. బంధుమిత్రుల మూలంగా కష్టనష్టాలెక్కువ. ప్రయాణాలలో జాగ్రత్త. పదోన్నతి. కళత్రంతో గొడవలు వుంటాయి. ఆర్థికవిషయాలు చక్కగా ఉన్నాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు.


**వృశ్చికం** విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

ఈ వారం ఆర్థికపరంగా అత్యంత అనుకూల సమయం. అనుకోని విధంగా డబ్బు మీ చేతికందుతుంది. వ్యాపార రంగంలోని వారికి నల్లేరు మీద బండి నడక. క్రయ విక్రయాలు జోరుగా సాగుతాయి. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు. రాజకీయ నాయకులు అసంతృప్తి, అసహనంతోవుంటారు.


**ధనుస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమపడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. మనోభావాలు బయటపెట్టలేక సతమతమౌతారు. దానగుణం కలిగి వుంటారు. స్థిరాస్తి, వృత్తి, వ్యాపారాల్లో ఎక్కువగా కృషి చేస్తారు. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు.


**మకరం** ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

సన్నిహితుల, మిత్రుల ద్వారా ప్రియవార్తా శ్రవణం. విశిష్ట వస్త్రాభరణ ప్రాప్తి. బంధుమిత్రుల కారణంగా శుభవ్యయాలుంటాయి. పూజాదులు బృంద కార్యక్రమాలు విజయవంతంగా సాగుతాయి. కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. సోదర వర్గ బలం మీకు బాగా కలిసివస్తుంది. పరోపకార తత్వంతో మెలుగుతారు. మెళకువగా వ్యవహరించండి.


**కుంభం** ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ఎంత కష్టమైనా న్యాయ మార్గంలోనే వెళ్ళండి. అపూర్వ వస్తు సంగ్రహణం. కుటుంబ వాతావరణాన్ని ఆహ్లాదకరంగా వుంచుతారు. సాంఘిక శుభకార్యాల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యవహారాల్ని అయిష్టంగా నిర్వహిస్తారు. దైవభక్తి కలిగి వుండడం వల్ల భాగ్య యోగం కలుగుతుంది. రాజాశ్రయం సిద్ధిస్తుంది. శైవ క్షేత్ర సందర్శన చేస్తారు. వ్యాపారులకు మంచి ప్రయోజనవంతమైన కాలం.


**మీనం** పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతిఫలం తప్పక పొందుతారు. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్కదిద్దుకొంటారు. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు.

## పంచాంగం

20తేది శుక్ర మూఢమి ఆఖరు.

**శుభ ముహూర్తాలు**

19, 22, 23 తేదీలలో తులా లగ్నాన ఉ.8.30 నుండి 10.00 గంటల వరకు సాధారణ శుభముహూర్తాలున్నాయి.

**సెప్టెంబర్ తిథులు**
**భాద్రపద బహుళ**

| | | | |
|---|---|---|---|
| 17 | శని | పంచమి | రా 11.05 గం.ల.వ |
| 18 | ఆది | షష్ఠి | రా 12.37 గం.ల.వ |
| 19 | సోమ | సప్తమి | రా 01.40 గం.ల.వ |
| 20 | మంగళ | అష్టమి | రా 02.14 గం.ల.వ |
| 21 | బుధ | నవమి | రా 02.21 గం.ల.వ |
| 22 | గురు | దశమి | రా 01.53 గం.ల.వ |
| 23 | శుక్ర | ఏకాదశి | రా 12.54 గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# నందశాలా దోషం అర్ధాంగికి ఇబ్బందికరం!

*బి.సత్యనారాయణ బెంగుళూరు*

* *దక్షిణ గృహం మాది. తూర్పు వరండా వున్నది. అమ్మ, భార్య ఆరోగ్యాలు బాగోలేవు. ఎందు చేత?*

దక్షిణ గృహం యమస్థానం. స్త్రీ సంబంధిత దిక్కు ఇందులో తూర్పు వరండా వుండటాన్ని 'నంద శాల' అంటారు. దక్షిణ దిశా భ్రష్టత వల్ల స్త్రీ అనారోగ్యవంతురాలవుతుంది. 'లక్ష్మీ గణపతి' యంత్రం సమస్యను పరిష్కరిస్తుంది.

*ఐ.రవికుమార్ నాయుడుపేట*

* *నాలుగు పోర్షన్ల ఇల్లు. ఏ యంత్ర ప్రతిష్ఠ మేలు చేస్తుంది?*

మీ నామ, నక్షత్రాన్ని బట్టి 'కుజదోషం' ఏర్పడుతున్నది. 'సుదర్శన యంత్ర' ప్రతిష్ఠకు సంప్రదించండి.

*జి.ఏసుపాదం తెనాలి*

* *క్రింద, పైన ఇళ్లు. ద్వారాల సంఖ్య ఏ ఇంటికాయింటికా, మొత్తం ఇంటికా?*

ఎక్కడైనా సరిసంఖ్యలో ద్వారాలుండాలి. మొత్తం కలిపినా సరిసంఖ్యలోనే వుండాలి. అయితే పది, ఇరవై సంఖ్యలు రాకూడదు.

*ఎన్.వి.ద్వారకానాథ్‌గుప్త హైదరాబాద్*

* *'లక్ష్మీగణపతి' యంత్ర ఫలితాలను చెప్పండి?*

గణపతి 'తర్పణ' ప్రియత్వం గలవాడు. అందు వల్ల 'తర్పణవిధి'ని నిర్దుష్టంగా నిర్వహించాలి. యంత్రం సర్వదోష హరం. విద్య, ధన, ఆరోగ్య ప్రాప్తిని కల్గిస్తుంది.

*కె.జేమ్స్ సుధాకరరావు సికింద్రాబాద్*

* *తూర్పు గృహంలో ఈశాన్యానికెదురు (తలుపు) వాయువ్య గదిలో ప్రార్థనలు చేయవచ్చా?*

సింహ ద్వారానికి తలుపులేని ప్రార్థనా మందిరం 'దోష'మవుతుంది. ఇలాంటప్పుడు ఆగ్నేయం వంటగదిలో 'పూజ' చేయడం ఉత్తమం అంటోంది. భారద్వాజ వాస్తుశాస్త్రం.

*అర్జున్‌సింగ్ పహేడా నెల్లూరు*

* *స్థలం ఈశాన్యం పెరిగింది. అందువల్ల ఆగ్నేయం నుంచి గోడ చాలా క్రాస్‌గా కనిపిస్తున్నది మంచిదేనా?*

స్థలం తూర్పు, ఉత్తరాలు 1.5 లేదా 3 అంగుళాలు మాత్రమే పెరగాలి. అంతకు పెరిగితే దారిద్ర్యమని 'వాస్తు మంజరి' అనే ప్రాచీన గ్రంథం చెబుతోంది.

*పి.సత్యంశాస్త్రి చిత్తూరు*

* *ఈశాన్యంలో దేవుడు కదా? మీరు తూర్పు చూడాలంటారు ఎలా సాధ్యం?*

ఈశాన్యం గదిలో దేవుడు ఈశాన్యంలో దేవుడు కాదు. ప్రచారం ఇష్టానుసారం జరిగింది. ఈశాన్యం గదిలో పశ్చిమంలో దేవుడి మండపం ఏర్పరిస్తే దేవుడు ఈశాన్యం లేదా తూర్పు చూస్తాడు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఇంతియాజ్ అహ్మద్ నెల్లూరు*

* *'డ్యూప్లెక్స్' నిర్మాణాల్లో మెట్లు దిగేటప్పుడు ఎలాంటి వాస్తు నిషిద్ధాలున్నాయి?*

గోడలు ఆవరించిన మూలల్లో 'మెట్లు' వస్తే అగాధాలవుతాయి. అంచేత మెట్లు దక్షిణ, పశ్చిమ మధ్య భాగాల్లో రావాలి. ఏమైనా 'స్వంత వైద్యం' వికటిస్తుంది. జాగ్రత్త!

*శైలజాయాదవ్ కల్లూరుపల్లి*

* *ఈశాన్యం వీధిపోటు స్థలంలో ఇల్లు కట్టిన నాలుగు మాసాల తర్వాత శ్రీవారు మరణించారు.*

వీధి చూపులు, పోట్లు కూడా 'దృష్ట', 'దృష్టి' దోషాల్ని కలిగి వుంటాయి. జ్యోతిష్యశాస్త్రరీత్యా శత్రు గ్రహ సంచారం వున్నప్పుడు 'దృష్టి' దోషాలు దాడి చేసి ప్రాణహరణం చేస్తాయని 'కశ్యపవాస్తు' చెబుతోంది.

*సి.సుజాత కర్నూలు*

* *తులసి ఆకు శుక్రవారం కోయకూడదంటారు నిజమేనా?*

తీర్థంలో వినియోగానికి తులసి దళాన్ని ఏ రోజైనా కోయవచ్చు.

*పంట అవినాష్‌రెడ్డి బుచ్చి*

* *నైరుతి స్థలం లోపిస్తే మంచిదంటారు నిజమేనా?*

నాలుగు దిక్కుల్లో ఏ స్థలమూ లోపించకూడదు. నైరుతి లోపం ఇంటి పెద్ద కుమారుడిపై ప్రభావం చూపిస్తుంది. మీ అనారోగ్యం, వ్యాపార నష్టాలకు కారణం ఈ లోపమే. 'సుదర్శన యంత్రం' ప్రతిష్ఠించుకోండి. కొంత మేలు జరుగుతుంది.

### ● అక్రమ లేఅవుట్లపై చర్యలకు

# నెల్లూరు ఆర్డీఓ సంసిద్ధం!

**ప్రభుత్వ అనుమతి తీసుకోకుండా నెల్లూరు డివిజన్‌లో వేసిన అక్రమ లేఅవుట్లను క్రమబద్ధీకరించుకోకుంటే వాటిపై చర్యలకు నెల్లూరు ఆర్డీఓ మాధవీలత సంసిద్ధులవుతున్నారు.**



నెల్లూరు ఆర్డీఓ మాధవీలత.

జిల్లావ్యాప్తంగా అనుమతి లేకుండా వేసిన లేఅవుట్లపై జిల్లా కలెక్టర్ ప్రత్యేక దృష్టి సారించారు. అన్ని మండలాల నుంచి పూర్తి వివరాలు తెప్పించుకున్న ఆయన అనుమతి లేకుండా వేసిన లేఅవుట్లను వెంటనే తొలగించాలని రెవెన్యూ డివిజన్ అధికారులను ఆదేశించారు. వ్యవసాయ భూముల్ని కొనుగోలు చేసిన రియల్‌ఎస్టేట్ వ్యాపారులు అసత్య ప్రకటనలతో ప్రజలను మోసం చేస్తూ లేఅవుట్లలో వేసిన ప్లాట్లను విక్రయించేస్తున్నారు.

కొనుగోలు చేసిన వారు లేఅవుట్లకు అనుమతి లేదన్న విషయం తెలుసుకొని తీవ్ర ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. జిల్లాలోని మూడు రెవెన్యూ డివిజన్లలో నెల్లూరు డివిజన్‌లో అధికంగా అక్రమ లేఅవుట్లు వున్నాయి. వీటిని పూర్తిగా పరిశీలించిన ఆర్డీఓ మాధవీలత సంబంధిత యజమానులకు తహశీల్దార్ల చేత నోటీసులు కూడా జారీ చేయించడం జరిగింది. లేఅవుట్లు వేసిన వారికి ఏదోఒక రూపంలో వివిధ రాజకీయ పార్టీలతో సంబంధాలు కలిగి వుండడంతో స్థానిక అధికారులు చర్యలు తీసుకునేందుకు వెనుకంజ వేస్తున్నారు. ఈ విషయం నెల్లూరు ఆర్డీఓ దృష్టికి వెళ్లడంతో గడువులోగా తొలగించాలని ఆదేశించారు.

నెల్లూరు నగర సమీపంతోపాటు ఆత్మకూరు, ఎఎస్‌పేట, పొదలకూరు తదితర ప్రాంతాల్లో లేఅవుట్లు వున్నాయి. వ్యవసాయ భూముల్ని నివాసాలకు అనుకూలంగా మార్పు చేసుకోవాలంటే రెవెన్యూ శాఖ నుంచి ముందస్తు అనుమతి తీసుకోవాలి. ఇందుకు సంబంధిత గ్రామ పంచాయితీకి కూడా కొంత ఫీజు చెల్లించాల్సి వుంటుంది. అయితే రాజకీయ పలుకుబడి కలిగిన వారు ఎవరి అనుమతి లేకుండానే లేఅవుట్లు వేసేసి పెద్ద బోర్డులను ఏర్పాటు చేస్తున్నారు. గ్రామ పంచాయితీ కార్యదర్శి ఎంతో కొంత ప్రతిఫలం అందడంతో మౌనంగా వుండిపోతున్నారన్న ఆరోపణలు వున్నాయి.

నెల్లూరు డివిజన్ పరిధిలో దాదాపు 150కిపైగా అనుమతి లేని లేఅవుట్లు వున్నట్లు అధికారులు గుర్తించారు. గత నెలలో లేఅవుట్ల యజమానులకు నోటీసులు జారీ కాబడ్డాయి. నిర్ణీత ఫీజు చెల్లించి లేఅవుట్లను క్రమబద్ధీకరించుకోవాలన్నదే నోటీసుల్లోని సారాంశం. ప్రభుత్వానికి అధిక మొత్తంలో ఫీజు చెల్లించాల్సి వున్నందున రాజకీయ పలుకుబడి ఉపయోగించి బయటపడాలని కొందరు ముమ్మరంగా ప్రయత్నాలు సాగిస్తున్నారు. నెల్లూరు ఆర్డీఓ మాధవీలత నోటీసుల్లో పేర్కొన్న వ్యవధిలోపల ఫీజు చెల్లించి క్రమబద్ధీకరించుకోని లేఅవుట్లు ధ్వంసం చేయాలని తహశీల్దార్లకు ఆదేశాలు జారీ చేశారు.

అక్రమ లేఅవుట్లు వేసి ప్రభుత్వానికి ఫీజు చెల్లించకపోవడంతోపాటు ప్రజలను నమ్మించి అంటగడుతున్నారు. రాజకీయ ఒత్తిళ్లకు లొంగకుండా తనదైన శైలిలో అక్రమ లేఅవుట్లను తొలగించేందుకు ఆర్డీఓ పూనుకున్నారు. నెల్లూరు ఆర్డీఓగా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి అక్రమ లేఅవుట్లు పూర్తి వివరాలు సేకరించుకుని చర్యలు తీసుకునేందుకు సిద్ధమయ్యారు. ఈమెను ఆదర్శంగా తీసుకొని కావలి, గూడూరు డివిజన్ల అధికారులు కూడా అక్రమ లేఅవుట్లపై దృష్టి సారిస్తే బాగుంటుంది.

J

**సైకిల్ ఎక్కని కమిషనర్లు**

### ● సైకిల్ ఎక్కడం

# నామోషీగా భావిస్తున్న కమిషనర్లు!

**నగరాలు, పట్టణాల్లో పారిశుధ్య పరిస్థితుల పరిశీలనకు కమిషనర్లు సైకిల్‌పై వెళ్లాలని ప్రభుత్వం ఇచ్చిన ఆదేశాలు అమలు కావడం లేదు. ఎసి కార్లలో తిరిగే కమిషనర్లు సైకిల్ ఎక్కడం నామోషీగా భావిస్తున్నారు.**

మునిసిపాల్టీలలో పారిశుద్ధ్యాన్ని మరింత మెరుగు పరచడంతోపాటు, ఖజానాపై భారం తగ్గించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇందులో భాగంగా రాష్ట్రంలో మునిసిపల్ కార్పొరేషన్ కమిషనర్లందరూ ఎసి కార్లను వదిలి సైకిళ్లపై నగరాల్లో పర్యటించాలని గత వారంలో ఉత్తర్వులు జారీ చేయడం జరిగింది. అయితే ఈ ఉత్తర్వులు అందుకున్న కమిషనర్లలో గూడూరు కమిషనర్ మాత్రమే సైకిల్‌పై పట్టణంలో పర్యటించి పారిశుద్ధ్యాన్ని పరిశీలించారు. మిగిలిన అధికారులు సైకిల్ ముఖం కూడా చూసేందుకు ఇష్టంలేదన్నట్లుగా వున్నారు.

మన జిల్లాలో నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌తోపాటు కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాల్టీలు వున్నాయి. ప్రతిరోజూ ఉదయం పారిశుద్ధ్యం తనిఖీ చేసేందుకు కమిషనర్లు వాహనాల్లో పర్యటిస్తుంటారు. వాహనాల్లో పర్యటించడం వలన కొన్ని ప్రాంతాలను తనిఖీచేసే వీలు లేకుండా పోతోంది. దీంతో పారిశుద్ధ్య సిబ్బంది కూడా సక్రమంగా వారికి కేటాయించిన ప్రాంతాల్లో విధులు నిర్వర్తించని పరిస్థితి తలెత్తుతోంది. పారిశుద్ధ్యం పట్ల పర్యవేక్షణ లేకపోవడంతో చెత్తాచెదారం పేరుకు పోతుంది. చెత్తను తొలగించేందుకు లక్షల రూపాయలు వ్యయంచేసి కొనుగోలు చేసిన వాహనాలు ఎక్కడ తిప్పుతున్నారో అధికారులకే తెలియాలి.

మునిసిపల్ కమిషనర్లు సైకిళ్లపై నగరాల్లో పర్యటించడం అవమానకరంగా భావించినట్లు కన్పిస్తుంది. నిన్నమొన్నటి వరకు ఎసి కార్లలో తిరిగిన వారు ప్రభుత్వ ఉత్తర్వుల నేపథ్యంలో సైకిళ్లపై తప్పనిసరిగా పర్యటించాల్సి వుంటుంది. మునిసిపాల్టీకి పన్నుల రూపేణా వచ్చే మొత్తంలో అధిక భాగం పారిశుద్ధ్యం మెరుగుకోసం వ్యయం చేస్తుంటారు. ఇందులో పర్యవేక్షణ కోసం వినియోగించే వాహనాలకు ఇంధనం ఖర్చు భారీగానే వుంటుంది. శానిటరీ సూపర్‌వైజర్లకు కేటాయించిన వాహనాన్ని సొంత పనులకు వినియోగించుకుంటూ ప్రభుత్వ ఆదాయానికి గండి కొడుతున్నారు.

అధికారుల పిల్లలను కళాశాల, పాఠశాలల్లో వదలడం, తిరిగి తీసుకరావడం ఈ వాహనాల డ్రైవర్ల ప్రధాన విధిగా మారింది. ప్రస్తుత సీజన్లో అంటు వ్యాధులు వ్యాపించే అవకాశం వుందని వైద్య ఆరోగ్య శాఖాధికారులు ప్రకటించారు. అన్ని గ్రామాలతోపాటు పట్టణ ప్రాంతాల్లో కూడా పారిశుద్ధ్యాన్ని మెరుగుపరచాలని అధికారులు కోరుతున్నారు. మునిసిపాల్టీలకు ప్రత్యేకాధికారులుగా వ్యవహరిస్తున్న వారు కూడా కమిషనర్లు సైకిళ్లపై పర్యటించాలని జారీచేసిన ఉత్తర్వుల గురించి పట్టించుకోవడం లేదు. ప్రత్యేకాధికారుల పరిపాలనలోకి మునిసిపాల్టీలను తీసుకొచ్చినప్పటికీ వాటి పనితీరులో ఏమాత్రం మార్పు కనిపించడం లేదు.

నెల్లూరు నగరంలో ప్రధాన కూడళ్లలో చెత్తా చెదారం ప్రతిరోజు తొలగించడం లేదు. దీంతో కొద్దిపాటి చినుకులు పడితే చాలు చెత్త కుళ్లి భరించలేని దుర్వాసన వెదజల్లుతుంది. దారిన వెళ్లే పాదచారులు కార్పొరేషన్ అధికారులు, సిబ్బందిని శాపనార్థాలు పెడుతూ వెళ్తుంటారు. మునిసిపాల్టీలకు ప్రత్యేకాధికారులుగా వ్యవహరిస్తున్న వారు పారిశుద్ధ్యం, త్రాగునీటి సరఫరాపై ప్రత్యేక దృష్టి సారించడంతోపాటు కమిషనర్లు సైకిళ్లపై నగరంలో పర్యటించాలన్న ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వులను కూడా అమలు చేసేందుకు కృషి చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.



## బిపాసాకో అవకాశం!

సినిమా ఎంత గ్లామర్ ప్రపంచమే అయినా అప్పుడప్పుడూ దానికి దూరంగా వున్న పాత్రల్ని ఎంచుకోవలసి వస్తుంది. పరిపూర్ణ నటి ఖ్యాతి గడించాలంటే వ్యాపార సూత్రాలకు దూరంగా వుండే చిత్రాల్లో నటించాల్సిందే. అలాంటి అవకాశం హీరోయిన్ బిపాస బసుకు దక్కింది. సృజనాత్మక సినిమాలను తనదైన శైలిలో ఆవిష్కరించే దర్శకుడు శ్యాంబెనగల్. హీరోయిన్ ఓరియెంటెండ్ చిత్రాలు తీసే ఆయన తాను తీసే తదుపరి చిత్రంలో బిపాసబసుకు అవకాశం ఇవ్వబోతున్నారు. ఈ చిత్రంలో బిపాస పాత్ర కొంతమేర గ్లామర్ పండించడానికి కూడా అవకాశముందంటున్నారు.

## నేనడగకుండానే పారితోషికం!



జీరో సైజ్ అందాలే కాదు; విభిన్నమైన పాత్రలు పోషిస్తూ కరీనాకపూర్ అగ్ర కథానాయికగా ఎదిగింది. ఆమె పారితోషికం పదికోట్లకు చేరిందంటున్నారు. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను ఈ విషయమై ప్రశ్నిస్తే ఓ పాత్రకు నేనైతే న్యాయం చేయగలనంటేనే దర్శక, నిర్మాతలు నన్ను సంప్రదిస్తారు. నేను అడగకుండానే నా పారితోషికం ఇంత ఇస్తామని చెబుతారు. ఇవ్వడానికి వాళ్లకు అభ్యంతరం లేనపుడు తీసుకోవడం తప్పుకాదుగా అంటుంది. తమ ప్రకటనల్లో నటించమని అడిగినంత ఇస్తామని కొన్ని కంపెనీలు కోరినా నేను ఆ పనికిమాలిన ప్రకటనల్లో నటించలేదు. కరీనాకపూర్ అంటే వినియోగదారుల్లో ఒక నమ్మకముంది. దాన్ని డబ్బుల కోసం పోగొట్టుకోలేనంది.

## నాకూ ఒకరోజు వస్తుంది!

తెలుగులో అగ్ర కథానాయకుల సరసన నటించి మురిపించిన శ్రియకు ప్రస్తుతం తెలుగులో అవకాశాలు లేవు. ముంబై వెళ్లి హీరో సల్మాన్ ఖాన్ సహకారం కోరదామనుకొంటే అతను అనారోగ్యంతో మంచమెక్కాడు. దీంతో అవకాశాల కోసం తెగ ప్రయత్నిస్తుంది. ఈ విషయాలపై మాట్లాడుతూ చిత్ర పరిశ్రమలో ఎప్పుడేం జరుగుతుందో తెలియదు. కానీ ఇక్కడ ప్రతిదీ ఒక అనుభవమే. ఇప్పటివరకు నటించిన ప్రతి సినిమాలో నాశక్తి మేర కష్టపడ్డాను. నాకంటూ మళ్లీ ఒక రోజు వస్తుందని నమ్ముతున్నానంది శ్రియ.



## ప్రియమణి చిటపట!



హీరోయిన్ ప్రియమణి చేతిలో ప్రస్తుతం క్షేత్రం చిత్రం మాత్రమే వుంది. దక్షిణాదిన మిగిలిన భాషల్లో కూడా ఆమెకు అవకాశాలు రావడం లేదు. ప్రియమణి డిమాండ్ ఇంతగా పడిపోవడానికి కారణం ఏమిటని సినీవర్గాలు చర్చించుకొంటున్నాయి. ఈ విషయాన్ని ప్రియమణి దగ్గర ప్రస్తావిస్తే చిటపటలాడింది. గత యేడాది 11 సినిమాల్లో నటించాను. దానితో పోలిస్తే 2011 అంత వేగంగా లేదు. రాజ్ సినిమా ఒక్కటే విడుదలైంది. అంత మాత్రాన ఖాళీగా వున్నట్లు జమ కడితే ఎలా? క్షేత్రం గాక మరో మూడు తెలుగు సినిమాల్లో ఈ యేడాది నటించాను. అవి విడుదల కాలేదు. దానికి నిర్మాతలు బాధ్యులు. నేనెలా బాధ్యురాలినవుతానంటుంది

## ప్రేమలో తాప్సీ



కెమెరా ముందు ప్రేమలో పడడం నటీనటులకు మామూలే. ఈ ప్రేమాయణం గూర్చి సినిమా అయ్యాక గంటో, రెండు గంటలో మాట్లాడుకొంటాం. కానీ తమిళ చిత్రసీమలో అందాల హీరోయిన్ తాప్సి ప్రేమ గూర్చి చర్చించుకొంటున్నారు. ఆమె రియల్ లైఫ్‌లో మహత్ రాఘవేంద్ర అనే తమిళ యువకుడి ప్రేమలో పడింది. ఇతను ఇప్పుడిప్పుడే తమిళ చిత్రాల్లో అవకాశాలు పొందుతున్నాడు. నటుడు శింబు మిత్రుడు. ఆ మిత్ర బృందంతోనే తాప్సికి పరిచయం కావడం, ఆ స్నేహం ప్రేమగా మారిందంటున్నారు. ఈ మేరకు తమిళ పత్రికల్లో కథనాలు వచ్చినా ఇటు తాప్సి గానీ అటు మహత్ గానీ ఖండించలేదు.



# హృదయాన్ని బరువెక్కించే ప్రేమఖైదీ!

అల్లూరు రహీం

చిత్ర సమీక్ష

ఈ మధ్య విడుదలవుతున్న తమిళ అనువాద చిత్రాలు తెగ ఆడేస్తున్నాయి. తెలుగు చిత్రాలకు సవాలు విసురుతున్నాయి. రంగం, కాంచన, 1947 ఎ లవ్ స్టోరీ చిత్రాల కోవలోనిదే లక్ష్మీగణపతి ఫిలిమ్స్ పతాకంపై సుబ్రహ్మణ్యం, రూపేష్ నిర్మించిన ప్రేమఖైదీ. టాగ్‌లైన్‌గా పేదోడి ప్రేమకథ అని పెట్టారు. కొన్ని చిత్రాల్లోని అంశాలు థియేటర్ నుంచి వచ్చాక కూడా మనల్ని వెంటాడుతాయి. ఆ కోవలోని చిత్రమే ప్రేమఖైదీ. ఇప్పుడొస్తున్న సినిమాల్లో ప్రేమ, పెళ్లి చాలా సులభంగా జరిగిపోతున్నట్లు చూపిస్తుంటారు. కానీ ప్రేమఖైదీ చిత్రంలో తమ ప్రేమను పండించుకోను ప్రేమికులు పడేపాట్లను చూసి సినిమాకు వచ్చిన వారంతా ఎవరికీ ఈ కష్టాలు రాకూడదని కోరుకొంటారు. కథలో విస్తృతి తక్కువైనా స్క్రీన్‌ప్లేతో దర్శకుడు ప్రభుసాలమన్ ప్రేక్షకులను కట్టిపడేస్తాడు. ఇప్పటివరకు ప్రేక్షకులు వెండితెరపై చూడని తమిళనాడు, కేరళల్లోని అటవీ ప్రాంతాలను ఎన్నుకొని షూటింగ్ చేసిన తీరు చూస్తూ ప్రేక్షకులు మైమరచిపోతారు. పర్వతశ్రేణులు, పొగమంచు, ఆకట్టుకొనే వాతావరణం, ప్రకృతి రమణీయతను కెమెరామెన్ సుకుమార్ అద్భుతంగా చూపాడు. లోయలో బస్సు పడిపోయినప్పుడు జైలర్‌ను హీరోయిన్ రక్షించమని హీరోకు చెప్పడం అతను రక్షించే సన్నివేశంతో కథ మలుపు తిరిగిపోతుంది. హీరో, హీరోయిన్ కోసం ఎంతటి కష్టాన్ని అయినా భరించడానికి సిద్ధపడేతీరు బాగుంది. హీరోయిన్ పరీక్షల సమయంలో కరెంట్ పోయినప్పుడు చదవాలంటే హీరో రాత్రంతా సైకిల్ తొక్కుతూ డైనమాతో వెలుతురు వచ్చేలా చేయడం బాగుంది. మితిమీరిన భావోద్వేగాలు విపరీత పరిణామాలకు దారి తీస్తాయని ఈ చిత్రం చివరన దర్శకుడు చెప్పిన తీరు బాగుంది. డి.ఇమాన్ సంగీతంలో మైనా మైనా... గుండెల్లోనా పాట మళ్లీ మళ్లీ వినాలనిపిస్తుంది. వెన్నెలకంటి ఈ చిత్రంలో వ్రాసిన మాటల వల్ల మనం డబ్బింగ్ సినిమా చూస్తున్నామనిపించదు. ప్రేమఖైదీ చిత్రంలో జైలు వార్డన్‌గా నటించిన తంబి రామయ్యకు జాతీయస్థాయి ఉత్తమ క్యారక్టర్ నటునిగా అవార్డు వచ్చింది. సినిమాలో హీరోయిన్ అమలా పాల్ సహజ సిద్ధ నటనతో ప్రేక్షకులను కట్టిపడేస్తుంది. అందువల్లే నాగచైతన్య సరసన బెజవాడ చిత్రంలో ఆమెకు హీరోయిన్‌గా ఛాన్స్ దక్కింది. హీరోగా విదార్థ్, జైలర్‌గా సేతు, హీరోయిన్ తల్లిగా గయ్యాళి పాత్రలో నటించిన నటీమణి నటన బాగుంది.

చిత్ర కథలోనికివెళ్తే తమిళనాడులోని కొండ ప్రాంతమైన సెవ్వం గుడిలో సామాన్య కుటుంబంలో పుట్టే సూరి(విదార్థ్) చదువు సంధ్యలకు దూరంగా వుంటాడు. నిత్యం చీట్లాట ఆడే అతని తండ్రి అతన్ని చెడిపోమని ప్రోత్సహిస్తుంటాడు. చిన్నప్పుడే కుటుంబ భారం మోయను జీపు క్లీనర్‌గా వెళ్లే సూరి ఏ ఆధారంలేని మైనా(అమలాపాల్) కుటుంబానికి ఓ దారి చూపిస్తాడు. మైనా తల్లి సూరిని అల్లుడూ అని పిలుస్తుంది. మైనాను స్కూల్‌కు తీసుకెళ్లడం, తీసుకరావడం మంచి చెడ్డలు చూడడంతో వారిద్దరి మధ్య ఊహ తెలియని వయసులోనే ప్రేమ మొదలవుతుంది. మైనా వయసుకొచ్చాక జరపాల్సిన కార్యానికి అవసరమైన పాతిక వేల ఖర్చును కూడా సూరి భరిస్తాడు. కానీ హృదయంలేని మైనా తల్లి ఆమెకు డబ్బుండే ప్రక్క ఊరి పిల్లవాడి సంబంధం చూస్తుంది. దీన్ని భరించలేని సూరి ఆమెపై చేయి చేసుకుంటాడు. ఆమె పోలీసు కేసు పెట్టగా సూరిని 15 రోజులు రిమాండ్‌కు పంపుతారు. ఇదే అదునుగా ఆమె పెళ్లికి అన్ని ఏర్పాట్లు చేస్తుంది. ములాఖత్‌కు వచ్చిన మిత్రుడు ఇచ్చిన సందేశంతో సూరి జైలు నుంచి తప్పించుకొంటాడు. స్వగ్రామం వెళ్లి అక్కడ భీభత్సం చేస్తాడు. సూరిని వెతుక్కొంటూ జైలర్ భాస్కర్ (సేతు), వార్డన్(తంబిరామయ్య) వెళ్తారు. కొండ దిగువున వున్న సెవ్వం గుడి చేరుకోను నానాపాట్లు పడతారు. అక్కడ నుంచి సూరిని పట్టుకొస్తుండగా వాళ్లతో మైనా కూడా వస్తుంది. దారిలో ప్రేమికుల భవిష్యత్తు కలలు, జైలు అధికారుల ఆగ్రహజ్వాలల మధ్య బస్సు యాక్సిడెంట్ జరుగుతుంది. ప్రాణాలకు తెగించి సూరి జైలర్, వార్డెన్‌ను రక్షిస్తాడు. వారిలో మార్పు వస్తుంది. సూరికి బెయిల్ ఇప్పించి పెళ్లి చేస్తానంటాడు వార్డన్. జైలర్ ఆ రాత్రికి మైనాను తన ఇంటికి తీసుకవెళ్తాడు. రాక్షసికి పర్యాయం వంటి జైలర్ భార్య మైనాను అనకూడని మాటలంటుంది. జైలర్ ఉదయాన సూరిని కోర్టుకు హాజరు పర్చను జైలుకు వెళ్లగా జైలర్ భార్య తన వాళ్లను పిలిపించి మైనా జుట్టు కోయించి రోడ్లో కొట్టిస్తుంది. దీన్ని తట్టుకోలేని మైనా రైలు క్రిందపడి మరణిస్తుంది. జైలు నుంచి కోర్టుకు వెళ్తూ దీన్ని చూసిన సూరి మైనా మరణాన్ని భరించలేక తానూ రైలు క్రిందపడిపోతాడు. జైలర్ ఈ ఘటనను చూసిన భావోద్వేగంతో తన భార్య, ఆమె తరపు బంధువులను మచ్చుకత్తితో తెగనరకడంతో చిత్రం ముగుస్తుంది.

హృదయం బరువెక్కే ప్రేమకథ అయినా దర్శకుడు ప్రభుసాలమన్ చివర వరకు నడిపిన తీరు ప్రేక్షకులను ఆకట్టుకొంది.



వార్తల్లో వ్యవసాయ సంయుక్త సంచాలకుల వారి కార్యాలయం.

## అధికారుల నడుమ ఆధిపత్యపోరు

జిల్లాలో పలు శాఖల్లో అధికారుల మధ్య ఆధిపత్యపోరు తారస్థాయికి చేరుకొంటోంది. కొన్ని శాఖల్లో కోల్డ్‌వార్ జరుగుతుండగా, వ్యవసాయ శాఖలో ఇది తీవ్రమై ఇరువురు అధికారులు ఒకరినొకరు దూషణలకు దిగడంతోపాటు చొక్కాలు పట్టుకొని కొట్టుకోవడం వరకు వెళ్లిందంటే పరిస్థితి ఎంత తీవ్రంగా వుందో అర్థమవుతుంది. ఈ శాఖలో జాయింట్ డైరక్టర్ నర్సప్ప, డిప్యూటీ డైరక్టర్ ఆనంద్‌కు మధ్య గత కొంత కాలంగా విభేదాలు కొనసాగుతున్నాయి. సిబ్బందిపై అజమాయిషీ, తనిఖీలు, పర్యవేక్షణలో ఇరువురి మధ్య తీవ్రస్థాయిలో స్పర్థలు ఏర్పడ్డాయి. అవి సెలవు పెట్టే విషయంలో బట్టబయలై తన్నుకొని ఫర్నిచర్‌ను ధ్వంసం చేసేవరకు వెళ్లి వ్యవసాయ శాఖ పరువు బజారున పడేలా చేసింది. దీనిపై ఉన్నతాధికారులు నివేదిక కోరినా జరగాల్సిన నష్టం జరిగిపోయింది. ఇదే విభేదాలు విద్యాశాఖ, దాని అనుబంధ విభాగమైన రాజీవ్ విద్యామిషన్‌లోనూ చోటుచేసుకొన్నాయి. జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగానికి, రాజీవ్ విద్యామిషన్ ప్రాజెక్ట్ అధికారి జిలానీ బాషాకు మధ్య కోల్డ్‌వార్ జరుగుతోంది. రాజీవ్ విద్యామిషన్ చేపట్టే కార్యక్రమాలకు ఉపాధ్యాయులను నియమించడంతో డిఇఓ తనకు తెలియకుండా టీచర్లు ఆ కార్యక్రమాలకు హాజరు కాకూడదని హుకుం జారీ చేశారు.




నెల్లూరు కొండాయపాలెం గేటు వద్ద గల హాస్టల్‌లో పనిచేయని ఇన్వర్టర్.

## మూలనపడ్డ ఇన్వర్టర్లు

జిల్లాలోని వివిధ హాస్టళ్లలో విద్యుత్ అంతరాయం లేకుండా వుండేందుకు ఏర్పాటుచేసిన ఇన్వర్టర్ల బాగోగులు పట్టించుకోకపోవడంతో అవి కాస్త మూలన పడ్డాయి. జిల్లా వ్యాప్తంగా గల 146 ఎస్సీ హాస్టళ్లు, 84 బిసి హాస్టళ్లు, 25 ఎస్టీ హాస్టళ్లతోపాటు మూడు ఆనంద నిలయాల్లో చదువుకొంటున్న విద్యార్థులు విద్యుత్ అంతరాయం కారణంగా ఇబ్బంది పడకుండా వుండేందుకు 2007 సంవత్సరంలో ఆనాటి కలెక్టర్ ఎం.రవిచంద్ర 14 లక్షల రూపాయలు వెచ్చించి 258 ఇన్వర్టర్లను అన్ని హాస్టళ్లలో ఏర్పాటు చేయించారు. ఇవి పెట్టిన కొంతకాలం బాగా పనిచేశాయి. తర్వాత వీటి నిర్వహణ గాలికొదిలేయడంతో మరమ్మత్తులకు గురై మూలనపడ్డాయి. అసలే శిధిలావస్థకు చేరుకొని అరకొర వసతులతో వుంటున్న హాస్టళ్లలో వుండే విద్యార్థులను అధికారులు పట్టించుకోకపోవడంతో విద్యుత్ సరఫరా ఆగిపోయినప్పుడు చదువులకు ఆటంకం ఏర్పడుతోంది. దీనిపై పలుమార్లు హాస్టల్ అధికారులకు విన్నవించినా ఫలితం లేకుండా పోవడంతో ఎంతో సదుద్దేశంతో ఆనాటి కలెక్టర్ ఏర్పాటుచేసిన ఇన్వర్టర్లు దేనికీ పనికి రాకుండా పోయాయి. వీటిని సరిదిద్దాల్సిన అవసరం వుంది.

## మహిళలకు రక్షణ కరువయ్యింది!

### నెల్లూరులో తెలుగు మహిళా రాష్ట్ర అధ్యక్షురాలు హైమావతి

రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజల బాగోగులు పట్టించుకోకుండా విచ్చలవిడిగా మద్యం అమ్మకాలతో ఆదాయం పెంచుకొనే మార్గం చూస్తోందని తెలుగుదేశం పార్టీ నేతలు విమర్శలు గుప్పించారు. సెప్టెంబర్ 11వ తేది జిల్లా తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో మహిళా కార్యకర్తల విస్తృతస్థాయి సమావేశం జరిగింది. రాష్ట్ర తెలుగు మహిళా అధ్యక్షురాలు హైమావతి, టిడిపి రాష్ట్ర ఉపాధ్యక్షుడు లాల్‌జాన్ బాషా, జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి తదితరులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. కాంగ్రెస్ పాలనలో రాష్ట్రంలో మహిళలకు రక్షణ కరువైందని, దాడులు అధికమయ్యాయని మహిళా అధ్యక్షురాలు హైమావతి విమర్శించారు. హోం మంత్రిగా మహిళ వున్నా మహిళలపై దాడులను అరికట్టి భద్రత కల్పించడంలో ఘోరంగా విఫలమవుతున్నారన్నారు. చంద్రబాబునాయుడి పాలనలో రాష్ట్రం అభివృద్ధిలో ప్రథమంగా నిలిస్తే కాంగ్రెస్ పాలనలో మహిళలపై దాడులు, అరాచకాలు, అక్రమాలు, అవినీతిలో ప్రథమంగా వుంటోందని ఎద్దేవా చేశారు. నిత్యావసర ధరలు చుక్కలనంటుతున్నా, రైతులు అవస్థలు పడుతున్నా, ప్రజలు సమస్యలతో సతమతం అవుతున్నా కాంగ్రెస్ ప్రభుత్వం పట్టించుకోకుండా వ్యవహరిస్తోందని లాల్‌జాన్ బాషా విమర్శించారు. మహిళలు చైతన్యవంతులు కావాలని, అందుకే జిల్లాలో గతంలో చేసిన పోరాటాల నుంచి స్ఫూర్తిని పొంది సమస్యలపై పోరాటానికి నడుం బిగించాలని జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో జిల్లా మహిళా అధ్యక్షురాలు అంచలవాణి, ఎమ్మెల్యేలు కురుగొండ్ల రామకృష్ణ, బల్లి దుర్గాప్రసాద్, నేతలు రమేష్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, విజయరామిరెడ్డి, అనురాధ, రాజేశ్వరమ్మ తదితరులు పాల్గొని ప్రసంగించారు.

## పోస్టాఫీసుల ద్వారా సబ్సిడీల సొమ్ము!

ఆర్థికంగా బాగా వెనుకబడిన వర్గాలకు వివిధ వస్తువులను సబ్సిడీల ద్వారా అందిస్తున్న కేంద్ర ప్రభుత్వం ఇక ఆ పద్ధతికి స్వస్తి పలకను రంగం సిద్ధం చేస్తున్నది. సబ్సిడీలకు వెచ్చిస్తున్న సొమ్మును నేరుగా లబ్దిదారులకు పోస్టాఫీసుల ద్వారా అందించాలని, దీనికవసరమైన ఖాతాలు తెరవను రంగం సిద్ధం చేస్తుంది. ఈ మేరకు కేంద్రంలోని ఆర్థిక శాఖ పోస్టాఫీసులను అన్ని కార్యకలాపాల నిర్వహణకు సిద్ధంగా వుండమని సర్క్యులర్ కూడా జారీచేసినట్లు తెలిసింది. పేద కుటుంబాలకు బియ్యం, చక్కెర, కిరోసిన్, పామాయిల్, వంట గ్యాస్‌ను ప్రభుత్వం సబ్సిడీపై అందిస్తుంది. దీనికిగాను ఒక్కో కుటుంబానికి రెండువేల రూపాయలు వెచ్చిస్తున్నట్లు లెక్కలు తేల్చింది. ఈ మొత్తాన్ని నేరుగా లబ్దిదారునికి ఇస్తే బాగుంటుందన్న ఆలోచనకు వచ్చిన ప్రభుత్వం ఆధార్ కార్డుల పంపిణీకి రంగం సిద్ధం చేసింది. ఈ కార్డులను పోస్టాఫీసులకు అనుసంధానం చేసి నగదు బదలీ చేయాలని ప్రణాళిక సిద్ధం చేసింది. తపాలాశాఖ పరిధిలో జిల్లాలో తొమ్మిది లక్షలకు పైగా ఖాతాలున్నాయి. ఆరు లక్షలకుపైగా వ్యక్తిగత ఖాతాలు, ఉపాధి హామీ పథకం క్రింద మూడు లక్షల ఖాతాలున్నాయి. ఇప్పటికే ఆధార్ కార్డులు జారీచేసిన వారి కోసం 75 వేల అకౌంట్లు ప్రారంభించను సంబంధిత పోస్టాఫీసులకు ఉత్తర్వులిచ్చారు. 31 సబ్ పోస్టాఫీసుల పరిధిలోని 202 బ్రాంచి పోస్టాఫీసుల్లో ఈ ఖాతాలు తెరవాలని హుకుం జారీ చేశారు. గ్రామాల్లోని బిపిఎంలు 50 రూపాయల కనీస డిపాజిట్‌తో ఖాతాలు తెరవను సిద్ధంగా వున్నారు. ఇది వాస్తవ రూపంలోనికొస్తే ఆర్థిక కార్యకలాపాలు పూర్తిగా నిలిచిపోయి మూసేస్తున్న పోస్టాఫీసులకు కూడా జవసత్వాలు కల్గడం ఖాయం.



రంగం సిద్ధం చేసిన ఆర్థిక శాఖ.



నెల్లూరీయుడు, తిరుపతిలోని స్విమ్స్‌లో ప్రొఫెసర్ డాక్టర్ అల్లాడి మోహన్‌కు వైద్య విద్య బోధనకుగాను ఉత్తమ ఉపాధ్యాయునిగా అవార్డు అందజేస్తున్న ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి.



ఉపాధ్యాయ దినోత్సవాన్ని పురస్కరించుకొని ఉత్తమ ప్రిన్సిపాల్‌గా విద్యాశాఖ ఎంపిక చేసిన అల్లూరు రామకృష్ణ జూనియర్ కాలేజి ప్రిన్సిపల్ మేదా రామకృష్ణారెడ్డిని సన్మానిస్తున్న ఎమ్మెల్యేలు శ్రీధర్‌కృష్ణారెడ్డి, బీద మస్తాన్‌రావు, వివేకానందరెడ్డి.



ఉపాధ్యాయ దినోత్సవాన్ని పురస్కరించుకొని అప్సా సంఘం నేతృత్వంలో జరిగిన కార్యక్రమంలో న్యూనేతాజి(జడ్ఎస్ఆర్) టాలెంట్ స్కూల్ అధినేత శ్రీనివాసులురెడ్డిని సన్మానిస్తున్న ఎమ్మెల్యేల త్రయం శ్రీధర్‌కృష్ణారెడ్డి, వివేకానందరెడ్డి, మస్తాన్‌రావు.




నెల్లూరులో జరిగిన వాకర్స్ ఇంటర్నేషనల్ 94వ కౌన్సిల్ సమావేశంలో మాట్లాడుతున్న ఆ సంఘం జిల్లా గవర్నర్ సుబ్రహ్మణ్యం యాదవ్. వేదికపై వాకర్స్ ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ వెంకట్రావు, కార్యదర్శి జి.విశ్వనాథం తదితరులు.

## చక్రబంధంలో ప్రభుత్వం!

మొదటి పేజీ కొరవ

పడి పోతామని ఆందోళన చెందుతున్నారు. వారిని సముదాయించడం ఎట్లానో ముఖ్యమంత్రికి అర్థం కావడం లేదు.

మొత్తం మీద తెలంగాణ ఉచ్చు గట్టిగానే బిగుసుకున్నది. కానీ కేంద్ర ప్రభుత్వం మాత్రం అంత త్వరపడి తెలంగాణపై ఒక నిర్ణయం తీసుకొనే ధోరణిలో లేదు. ఏదైనా నిదానం మీద జరగాలన్నది వారి ఆలోచన. అందులోనూ సోనియా గాంధీకి ఆరోగ్యం బాగులేదు కాబట్టి, నిర్ణయం తీసుకొనేవారు కూడా లేరు. ఆమె సమ్మతి లేకుండా ఇంత కీలక విషయంలో నిర్ణయం తీసుకొనే మగాడెవడూ లేడు – ఢిల్లీ సర్కారులో. ఆమె ఇప్పట్లో దీనిపై మనసు పెట్టే స్థితిలో లేదు. కనీసం నాలుగైదు నెలలపాటు సోనియాగాంధీ రాజకీయ కార్యకలాపాలకు దూరంగా వుండక తప్పదని డాక్టర్లు చెప్తున్నారు.

1969 నాటి తెలంగాణ ఉద్యమంలో కూడా ప్రభుత్వ ఉద్యోగులు ఇదే ప్రకారం సమ్మెకు దిగారు. 45 రోజుల పాటు విధులు బహిష్కరించారు. అయితే అప్పట్లో విద్యుత్ మీద ప్రజలు ఇంతగా ఆధారపడి లేరు. పై పెచ్చు ఆనాడు ఇటువంటి సవాళ్లను సునాయాసంగా ఎదుర్కోగలిగిన ధీర వనిత ఇందిరమ్మ వుండేవారు. కానీ ఇప్పుడు అంత స్థిరమైన రాజకీయ పోకడ అవలంభించే నేతలు దేశం మొత్తం మీద ఎవరూ లేరు.

కిరణ్‌కుమార్‌కి రెడ్డికి ఇది ఒక అగ్నిపరీక్ష. దీన్ని సమర్థంగా ఎదుర్కొని ఏదో ఒక రూపంలో సమ్మెను నిర్వీర్యం చేయగలిగితే ఆయన ప్రతిష్ఠ ఢిల్లీ స్థాయిలో రెప రెప లాడుతుంది. అందులో విఫలమైతే మాత్రం చరిత్రలో చాలా అథమ స్థానంలో చోటు దొరుకుతుంది.

---

## చెరువు గుటకాయ స్వాహా!

9వ పేజీ కొరవ

భయపడుతున్నట్లున్నాడాయన. ఏ తప్పు చేయకుండా సంపన్నుల జాబితాలో పేరు చేరదు కదా?

మొత్తానికి ఈ కబ్జా వ్యవహారం రెవిన్యూ అధికారులకు పెద్ద తలనొప్పిగా మారింది. అది చెరువని తెలుసు. రెవిన్యూ రికార్డులు స్పష్టంగా వున్నాయి. కానీ దాని జోలికి వెళ్తే ఎమ్మెల్యే ఆగ్రహిస్తాడు. విశ్వామిత్రుడి కోపమైనా తట్టుకోవచ్చు కానీ వివేకానందరెడ్డి రుసరుసలు భరించడం కష్టం. పెంట మీద రాయి వేసిన చందమది. ఇంత గోల తర్వాత వూరకే వదిలేస్తే జనం నోట్లో వూస్తారు. అట్లని చర్య తీసుకొంటే, ఉక్రవుడియంగా వచ్చి పడుతున్న వంద కోట్ల ఆక్రమణకు గండి కొట్టారని ఎమ్మెల్యే నోరు పారేసుకొంటాడు. పెద్ద సంకటమే పాపం అధికారులకు. చివరకు ఏమి జరుగుతుందో వెండి తెర మీద వేచి చూద్దాం.

---

## జనవాణి

2వ పేజీ కొరవ

సేవ చేశారు. 1999 సంవత్సరంలో పిసిసి అధ్యక్షుడిగా వుండి 100 మంది ఎమ్మెల్యేలను గెలిపించి అసెంబ్లీలో గట్టి ప్రతిపక్షంగా నిలిచారు. 2004, 2009 సంవత్సరాలలో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ విజయరథసారధి ముమ్మాటికీ వైఎస్.రాజశేఖర్ రెడ్డినే. కేంద్రంలో యుపిఏ ప్రభుత్వం రాజశేఖర్‌రెడ్డి రెక్కల కష్టమే. కాని ఆయన మరణించాక వారి కుటుంబంపై మరీ ముఖ్యంగా ఆయన కుమారుడు వైఎస్.జగన్మోహన్‌రెడ్డిని పాతాళానికి అణగద్రొక్కే ప్రయత్నం మంచిది కాదు.

*బిఆర్.శాలి* కావలి

## తెలుగును రక్షించుకోవాలి!

ప్రతి యింట్లో పిల్లలు అమ్మా, నాన్న అని పిలవడం మర్చిపోయారు. 95శాతం మంది మమ్మీ, డాడీ అనే పిలుస్తున్నారు. ఈ మధ్య విజయవాడలో జరిగిన తెలుగు రచయితల మహాసభలో ప్రఖ్యాత రచయిత గొల్లపూడి మారుతీరావు తెలుగు భాష గూర్చి ఆంగ్లంలో ప్రసంగించడం బాధాకరం. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి సైతం తెలుగులో మాట్లాడను ఇబ్బంది పడుతుంటారు. తెలుగుభాషపై తెలుగు ప్రజలకు మమకారం తగ్గిపోతోంది. ఈ విషయంలో తెలుగు ప్రజలు ప్రక్కనే వున్న తమిళ ప్రజలను ఆదర్శంగా తీసుకొంటే బాగుంటుంది.

*రక్షిత* నెల్లూరు

---

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### నిలచిన 108 వాహనాలు

జిల్లాలో అత్యవసర వైద్యం కోసం తిరిగే 108 వాహనాలు నిలిచిపోయాయి. మొత్తం 27కు పైగా వాహనాలు సేవలందిస్తుండగా వాటిలో పలు వాహనాలు తిరగడం లేదు. డీజిల్ కొరత, సిబ్బందికి జీతాలు సక్రమంగా అందించకపోవడంతో వీటికి బ్రేక్ పడినట్లు సమాచారం.

### చేపల కాలువలో కొండ చిలువ

తడ మండలంలోని చేనిగుంట చెరువులో జాలర్లకు కొండ చిలువ చిక్కింది. చేపల వేటకు వెళ్లిన జాలర్లు చేపలకోసం వల విసరగా కొండ చిలువ వలలో పడింది. బరువుగా వుండడంతో చేపలు అధికంగా వలలో పడ్డాయని భావించిన మత్స్యకారులు ఒడ్డుకులాగి చూడగా పది అడుగుల పొడవుగల భారీ కొండ చిలువ వలలో కన్పడ డంతో భయపడ్డారు. అటవీశాఖ అధికారులకు సమాచారం అందించడంతో వారు వచ్చి దానిని అడవిలో వదిలేశారు.

### ఎమ్మెల్యే వివేకాపై బల్లి విమర్శలు

జిల్లాలో మనీ స్కీంలో చేరి ఆర్థికంగా నష్టపోయిన బాధితులకు న్యాయం చేస్తామంటూ ఇందిరా భవన్‌కు పిలిపించుకొన్న రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి తీరును గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ తప్పుపట్టారు. న్యాయం చేయాల్సింది పోయి కార్యాలయాలకు పిలిపించుకోవడం సిగ్గు చేటన్నారు. పనిలో పనిగా రాహుల్‌గాంధీ పైనా విమర్శలు గుప్పించారు. సూక్ష్మరుణాలను ప్రోత్సహించి మహిళల ఆత్మహత్యలకు కారణమయ్యాడని ఆరోపించాడు.

### బాలయ్య ప్రకటనతో సంబరాలు

వచ్చే ఎన్నికల్లో పోటీ చేస్తానని సినీ హీరో నందమూరి బాలకృష్ణ ప్రకటించడంతో ఆయన అభిమానులు హర్షాతిరేకాలు వ్యక్తం చేశారు. బాలయ్య ప్రకటనతో టిడిపి నేతలు రమేష్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఆధ్వర్యంలో అభిమానులు నర్తకి సెంటర్‌లో టపాసులు పేల్చి సంబరాలు చేసుకొన్నారు. వారు మాట్లాడుతూ బాలయ్య రాకతో టిడిపి మరింత బలోపేతం అవుతుందన్నారు. ఈ సందర్భంగా మిఠాయిలు పంచారు.

### అక్టోబర్ 11న యువ దుందుభి

అవినీతికి వ్యతిరేకంగా విద్యార్థుల సమస్యలపై హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో అక్టోబర్ 11న యువ దుందుభి కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నట్లు బిజెపి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రామచంద్రరావు తెలిపారు. జాతీయ అధ్యక్షుడు నితిన్ గడ్కారి హాజరయ్యే ఈ సమావేశానికి జిల్లాలోని యువమోర్చా కార్యకర్తలు అధిక సంఖ్యలో తరలిరావాలని కోరారు.

### కోచ్‌లు కొట్టుకొన్నారు

గూడూరులో జరిగిన తైక్వాండో పోటీల్లో కోచ్‌ల మధ్య వివాదం ఘర్షణకు దారితీసింది. నల్గొండ జిల్లాకు చెందిన సుధాకర్, కోటేశ్వరరావు అదే జిల్లాకు చెందిన కృష్ణ, సుధాకర్‌లు ఘర్షణపడి దాడికి దిగడంతో తీవ్రగాయాలు కాగా ఆస్పత్రికి తరలించారు. విద్యార్థులను పోటీలకు ప్రోత్సహించాల్సిన కోచ్‌లే తన్నుకొని ఆస్పత్రి పాలవటంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అయ్యాయి.

### భార్య గొంతు కోశాడు

కట్నం డబ్బులు తేలేదని భార్య గొంతుకోసి ప్రాణాలు తీసిన ఘటన నాయుడుపేట మండలం చిగురుపాడులో జరిగింది. స్థానికంగా వుంటున్న వెంకటరమణ వెంకటగిరికి చెందిన స్వాతిని పెళ్లి చేసుకొన్నాడు. కట్నం డబ్బులపై నిత్యం వేధిస్తున్న భర్త సెప్టెంబర్ 10వ తేది కత్తితో భార్యపై దాడిచేసి ఆమె గొంతుకోసి కిరాతకంగా హత్యచేయడం సంచలనం రేపింది.

### పర్సంటేజీల కోసమే పనిచేస్తున్నారు

ఇరిగేషన్ అధికారులు పర్సంటేజీల కోసమే పనిచేస్తున్నారు తప్ప ప్రజల కోసం కాదని తిరుపతి ఎమ్పీ చింతామోహన్ తీవ్రంగా విమర్శించారు. సూళ్లూరుపేటలో అధికారులతో సమావేశం నిర్వహించిన తర్వాత ఇరిగేషన్ అధికారుల పనితీరుపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. పనులు చేయకుండా పర్సంటేజీల కోసం చెక్కులు రాస్తూ ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారని ఆగ్రహించారు.

### గ్రామాలు గబ్బుకొడుతున్నాయి

ప్రత్యేకాధికారుల పాలనలో గ్రామాలు గబ్బుకొడుతున్నాయని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి అభిప్రాయపడ్డారు. జిల్లా పరిషత్ మీటింగ్ హాల్‌లో ఎమ్పీడిఓలు, మండల పంచాయితీరాజ్ ఇంజనీర్లతో కలెక్టర్ సమీక్షా సమావేశం జరిపారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ సర్పంచ్‌ల పరిపాలనే పరవాలేదనిపించింది. ఇటీవల బుచ్చి, సూళ్లూరుపేట, నాయుడుపేట, ఆత్మకూరు పంచాయితీలను పరిశీలించాను. పరిస్థితులు అధ్వాన్నంగా వున్నాయి. అదనపు బాధ్యతలని పని చేయకుంటే ఎలాగని అధికారులను ప్రశ్నించారు.

### రెడ్‌క్రాస్ రామచంద్రారెడ్డి మరణం

నెల్లూరు సిసిఎస్ నగర్ వాసి, మాజీ మునిసిపల్ కమిషనర్ ఈశ్వరవాక రామచంద్రారెడ్డి(82) 9వ తేది మరణించారు. 1987లో నెల్లూరు మునిసిపల్ కమిషనర్‌గా పనిచేసిన రామచంద్రారెడ్డి గుంటూరు, ఏలూరు, రాజమండ్రిలలో కూడా కమిషనర్‌గా రాణించారు. నెల్లూరు మునిసిపాలిటీలో కొంతకాలం స్పెషల్ ఆఫీసర్‌గా కూడా పని చేశారాయన.

పదవీ విరమణ చేశాక నెల్లూరు రెడ్‌క్రాస్ సొసైటీ జాయింట్ కార్యదర్శిగా సేవలందించారు. ముఖ్యంగా బ్లడ్ బ్యాంకులో ఆయన సేవ అపారం. మరణానంతరం ఆయన నేత్రాలను మోడరన్ ఐ క్లినిక్‌కు దానం చేశారు. ఆయనకు నలుగురు కుమారులు.

### న్యాయవాది సుబ్బరామిరెడ్డి మరణం

గూడూరులో పేరు ప్రఖ్యాతులు గడించిన సీనియర్ న్యాయవాది వాకాటి సుబ్బరామిరెడ్డి(78) 9వ తేది మరణించారు. సుబ్బరామిరెడ్డిలో దానగుణం మెండు. అందువల్లే అందరిచేత మంచి వ్యక్తిగా కీర్తింపబడ్డారు. గూడూరు కోర్టులో ఎజిపిగా 18 ఏళ్లు, ధర్మరాజుల స్వామిదేవస్థానం ఛైర్మన్‌గా, మునిసిపల్ కౌన్సిలర్‌గా, విఆర్ క్లబ్ అధ్యక్షునిగా ఏ పదవిలోనైనా ఒదిగిపోయేవారాయన. ఆయనకు భార్య, ఇద్దరు కుమారులున్నారు.

### విజయభాస్కర్‌రెడ్డికి మాతృ వియోగం

నాయుడుపేట మాజీ సర్పంచ్, మాజీ అగ్రికల్చర్ మార్కెటింగ్ కమిటీ ఛైర్మన్ శిరసనంబేటి విజయభాస్కర్‌రెడ్డి తల్లి ప్రభావతమ్మ(68) 13వ తేది నాయుడుపేటలో మరణించారు. ఆమెకు భర్త వున్నారు. విజయభాస్కర్‌రెడ్డి ఏకైక కుమారుడు. మాతృ వియోగంలో వున్న విజయభాస్కర్‌రెడ్డిని ఆ ప్రాంత రాజకీయ నాయకులు, అధికారులు పరామర్శించారు.

ఆత్మీయులను కోల్పోయిన పై మూడు కుటుంబాల వారికి మా సానుభూతి.

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
**సంవత్సర చందా**
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

# తూతూ మంత్రంగా రెవిన్యూ సదస్సులు!

**ఈ నెల 2వ తేది నుంచి గ్రామాల్లో జరుగుతున్న రెవిన్యూ సదస్సులు నామ్‌కే వాస్తేగా జరుగుతున్నాయి. వీటి గూర్చి ముందస్తు సమాచారం రైతులకు అందజేయడంలో అధికారులు పూర్తిగా విఫలమయ్యారు.**

భూ సమస్యలను పరిష్కరించాలన్న లక్ష్యంతో రాష్ట్రప్రభుత్వం ప్రతిగ్రామంలో రెవెన్యూ సదస్సుల ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. భూముల హద్దులు, సర్వేనెంబర్లు, పట్టాదారు పాసుపుస్తకాల జారీ, సవరణలు చేయడం ఈ సదస్సుల ఉద్దేశం. జిల్లాలో ఈనెల 2వతేదీ నుంచి రెవెన్యూ సదస్సులు జరుగుతున్నాయి. ఒక్కో మండలంలో ఒక్కో తేదీ నుంచి వీటిని గ్రామాల్లో ఏర్పాటు చేస్తున్నారు. రెవెన్యూ సదస్సుల ఏర్పాటు గురించి ముందస్తు సమాచారం రైతులకు అందజేయడంలో అధికారులు విఫలం చెందుతున్నారు.

గ్రామీణ ప్రాంతాల్లో ప్రధానంగా భూ సమస్యలు అధికంగా వున్నాయి. ప్రభుత్వ భూములతో పాటు పట్టాభూముల్ని కొందరు బలవంతంగా ఆక్రమించుకుంటున్న సందర్భాలు అనేకం వున్నాయి. వీటిని పరిష్కరించాలని బాధితులు మండల తహశీల్దార్ కార్యాలయం నుంచి జిల్లా కలెక్టరేట్ వరకు తిరుగుతున్నారు. వినతి పత్రాలు స్వీకరిస్తున్నారే తప్ప బాధితులకు పరిష్కారమార్గం చూపడం లేదు. గ్రామాల్లో చోటు చేసుకున్న రాజకీయ ఒత్తిళ్ల కారణంగా ఒక వర్గానికి అధికారులు కొమ్ముకాస్తుండడంతో బాధితులకు సరైన న్యాయం జరగడం లేదన్న ఆరోపణలు వున్నాయి. పట్టాభూముల్ని ఆక్రమించిన వారే కోర్టులకు వెళ్లిన దాఖలాలు వున్నాయి.

రెవెన్యూ సదస్సుల పేరుతో గ్రామాలకు వెళుతున్న రెవెన్యూ అధికారులు, సిబ్బందికి ప్రజల నుంచి నిరసనలు వ్యక్తం అవుతున్నాయి. సంవత్సరాల నుంచి వివాదంగా వున్న భూ సమస్యలను పరిష్కరించాలని విన్నవించుకున్నా స్పందించని అధికారులు ఒక్క రోజులో వాటిని ఎలా పరిష్కరిస్తారని రైతులు నిలదీస్తున్నారు. రైతుల నుంచి నిరసనలు వ్యక్తం కావడంతో అధికారులు ఖంగుతింటున్నారు. ఏదో ఒక విధంగా సర్దిచెప్పి గ్రామాల నుంచి బయటపడాల్సిన పరిస్థితి తలెత్తుతోంది. గ్రామాల్లో నిర్వహించే రెవెన్యూ సదస్సులకు తహశీల్దార్, ఆర్.ఐ, సర్వేయర్, స్టాటిస్టికల్ ఆఫీసర్, వీఆర్వో తదితర సిబ్బంది హాజరవుతున్నారు.

కొన్ని మండలాల్లో నిర్వహిస్తున్న రెవెన్యూ సదస్సులలో రెవెన్యూ అధికారులు, సిబ్బంది రైతుల పట్ల దురుసుగా ప్రవర్తిస్తున్నారంటూ ఉన్నతాధికారులకు ఫిర్యాదులు వెళ్లాయి. వీటిని జిల్లా కలెక్టర్ పరిశీలిస్తున్నారు. గత వారంలో మండల తహశీల్దార్లతో నిర్వహించిన సమీక్షా సమావేశంలో కలెక్టర్ చాలా ఘాటుగానే స్పందించడం జరిగింది. పేదలకు ఒక న్యాయం, ధనికులకు మరో న్యాయం చేసే తహశీల్దార్లపై కఠిన చర్యలు తీసుకోవడం జరుగుతుందని హెచ్చరికలు చేశారు. ఇలా వ్యవహరిస్తున్న అధికారుల పేర్లు వెల్లడించకుండానే హెచ్చరించడంతో సమీక్షకు హాజరైన తహశీల్దార్లు ఒకరితో ఒకరు చర్చించుకోవడం కనిపించింది.

సమస్య తీవ్రతను బట్టి అధికారులు వ్యవహరించాలన్నారు. అవసరమైతే పైస్థాయి అధికారుల ఆదేశాలు తీసుకొని పరిష్కరించాలే తప్ప ఇష్టానుసారంగా వ్యవహరిస్తే ఇంటికి పంపాల్సి వుంటుందని తనదైన శైలిలో మందలించారు. రెవెన్యూ సదస్సు సందర్భంగా రైతుల నుంచి స్వీకరించిన అభ్యంతరాలు, పరిష్కరించిన భూ సమస్యల వివరాలు అందుబాటులో వుంచడం లేదు అధికారులు. రెవెన్యూ సదస్సుల పేరిట గ్రామాలకు వెళ్లి వస్తున్నారే గాని సమస్యలు మాత్రం అలానే పేరుకొని వున్నాయి.

# సినారె 'రేపటి వైపుచూపు' క్రాంతి దర్శిత్వానికి 'ఆనవాలు'!

ఓ వింత జీవి బ్రహ్మనడిగింది 'నేను సముద్రపు లోతులు చూసివస్తాను ఆనతివ్వమని' విధాత తలపంకించాడు. జీవి తిరిగి వచ్చింది. 'ఉదధి' తత్వమింతేనా? అని తన భావనలను ఏకరువు పెట్టింది. సృజన కర్త ఆశ్చర్య, దిగ్భ్రమలకు లోనయ్యాడు. మరి మనిషి అంతర్యంలోకి వెళ్లిరాగలవా? అడిగాడు చతురాననుడు. ఓస్ అదెంత పని అంది జీవి. అనుకొన్నదే తడువుగా మనిషిలోకి ప్రవేశించింది. నిముషాలు, గంటలు, దినాలు గడిచాయి. బ్రహ్మకు విసుగనిపించింది. ఇంతలో అలజడి, జీవి ఉక్కిరిబిక్కిరవుతూ మనిషి నుండి బయట పడింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో హైరానా పడింది. వాగ్దేవిపతి ఉత్సుకతతో ఏమయింది అని అడిగాడు? జీవి గసపోస్తూ అంది. నా వల్ల కాదు సృష్టికర్తా! అమ్మో మనిషి, వామ్మో మనిషి అని పారిపోయింది. సృష్టికర్త విరగబడి నవ్వాడు.

ఆ జీవిని నేనే! సముద్రం సమాజం! ఆ మనిషి డాక్టర్ సినారె అనుభవాల్ని, అంతఃకరణాన్ని తన భావుకతతో సహస్ర ముఖాలతో ఏకధాటిగా కథలు చెప్పినట్లు కవితలల్లగలవాడు, భాషించునట్లు భావాన్ని ఉప్పెనలా మలచగలవాడు, మనల్ని ఉలిక్కిపడేలా చేయగలవాడు, ఆయన కవితల్ని, కవిత్వతత్వాన్ని బేరీజు వేయడం అంత సులభమూ, ఆషామాషీ వ్యవహారమూ కాదు. అందుకే పై కథను చెప్పాను! ఇంతచేసి అవి సమాజానికి, మనిషికీ బాహ్యమైన అంశాలు కాదు. తను, తన పరిసరాలు, తన అనుభవాలే. జీవితాన్ని అనుభవాలతో పండించుకొన్న మేధో సంపన్నుడు కాబట్టి ఆయన కవిత్వం ఆయన చుట్టూ తానే పరిభ్రమిస్తూ వుంటుంది.

'సినారె' కవిత్వాన్ని చదువుతూపోతే రవీంద్ర కవీంద్రుని వైచిత్రి, కవిత్వ దర్శనమూ, ఆయన కవితా అంతర్ఘోష వీరిలోనూ, వీరి కవిత్వంలోనూ ప్రతిఫలిస్తూ వుంటుందనిపిస్తుంది. అదో మనోతాత్వికత! 'సినారె' కవిత్వంలో ఓ హృదయం వున్న మిత్రుడున్నాడు, స్పందించగల హృదయం వున్నది, ఓ విశ్లేషకుడున్నాడు, ఓ నీతి బోధకుడున్నాడు, ఓ దార్శనికుడున్నాడు. ఆయన మనసాక్షటే. అది వివిధ రూపాలతో 'విశ్వంభరత్వాన్ని' ప్రదర్శిస్తూ వుంటుంది. సమాజాన్ని చదివి, అధ్యయనం చేసిన తరచూచిన తర్వాత మనల్ని ముందుగా జాగ్రత్త పడమని మనస్తత్వవేత్తగా హెచ్చరిస్తున్నారు సినారె. ఉత్తరం వస్తే చదవాలనే తపన సహజం. వాటిలో పైకెగరేసేవి, దిగదోసేవీ వుండవచ్చు కదా. అందుకని "ఎందుకైనా మంచిది ముందుగానే పెదవులపై ఓ చిరునవ్వును పదిలపరచుకొంటే చాలు అంటారు. ఎంతటి నిష్ఠూరతా సత్యమది!! (నాలుగు వైపుల నుంచి) ప్రశ్నించడం విజ్ఞానానికి వారధి నిర్మించడం వంటిది. ఆదిశంకరుల నుంచి చిన్మయానంద వరకూ ఆ మాటే అన్నారు. సినారె అంటారు కదా? "సృష్టి వికాస విజ్ఞానానికి, సాంస్కృతిక విలసనానికి, నాగరికతా సముజ్వలనానికి మౌలిక ధాతువులు ప్రశ్నలే"(ప్రశ్నల ఆంతర్యం).

**నా చూపు రేపటి వైపు**

కవితా సంపుటి

కవి : డాక్టర్ సి.నారాయణరెడ్డి

సమీక్షకుడు : పాయసం సుబ్రహ్మణ్య మహర్షి

పేజీలు : 172 ధర : 150/-

ప్రతులకు

విశాలాంధ్ర, నవోదయ బ్రాంచీలు.
హైదరాబాద్.

కాలాన్ని, కాలజ్ఞుల్ని బేరీజు వేయగల శక్తి ఎనభై ఒకటవ వసంతంలోకి ప్రవేశించినా సింగిరెడ్డి గారికే సాధ్యం! "నిర్విరామంగా కదలిపోయే కాలానికీ, క్షణాలు అనుచరులు. కాలజ్ఞులంటే ఎవరో కాదు క్షణాలను అనుక్షణం మనసు అద్దంలో చూసుకొనేవారే". (క్షణాలు నిద్రపోవు). మనిషి తయారుచేసిన యంత్రం 'గడియారం' అది సూర్యుడిలా నిర్విరామం చరిస్తూనే మనిషి సోమరితనాన్ని వెక్కిరిస్తూ వుంటుంది. సినారె వ్యంగ్యంగా ఎలా అంటారో చూడండి. "మన జీవన గమనాన్ని గడియారం ముళ్లు నిర్దేశిస్తుంటాయి. ఎంతటి పరాధీనత మనది?!"(కాలజ్ఞత).

సినారె రిలాక్స్ అవుతూ కూర్చుని వుండటం అలసత్వం ఆవరించి కాదట. "కూర్చుని వున్నప్పుడు నా మనసులో రకరకాల మెరుపులొస్తుంటాయి. వాటిని అక్షరాల్లోకి ఎక్కించినపుడే నాలో సరికొత్త ఉద్దీప్తి పుడుతుంది(సృజనయాగం).మన మనసులాగా కాలం ఆగిపోదు. దాని చూపు ఎప్పుడూ ముందు చూపే. "సమయం ఒంటరిదే కాని దాని వెంట సమూహాలు నడుస్తుంటాయి(సమయ గమనం) అంటారు ఓ చెణుకు విసురుతూ.

చేదు, తీపి కలయికల మిశ్రమం జీవితం. ఎన్నో స్మృతులు విస్మృతులై పోయినా కొన్ని నిత్య మననీయంగా మిగిలిపోతాయి. "కటిక చేదు స్మృతులను మనసు అద్దంపై నుంచి తుడిచేసుకుంటూ మధురిమలు పంచే స్మృతులను ప్రతిబింబించుకొంటూ ప్రస్థానించడమే మన లక్ష్యం కావాలని కోరుకొందాం. (స్మృతులు బింబాలై) అంటూ ఆశావహ దృక్పథాన్ని నిర్దుష్టంగా చెబుతారు రెడ్డిగారు. సంపుటిలో తనకు తానుగా అంతర్ముఖుడై చెప్పుకొంటున్నట్టనిపిస్తున్న హితోక్తులు మనకు, సమాజానికి కూడా వర్తిస్తాయి. "అసంబద్ధపు వాంఛలను విదిలించుకొని నేను నేనుగా ఉండిపోవాలని నిర్ణయించుకొన్నాను.(ఇంద్ర ధనుస్సు), శైథిల్యం పాతబడిన గోడలకే కానీ ఆలోచనలకు కాదు. మేధకు కాకపుడితే తప్ప కొత్త ఆలోచనలు ఆవిర్భవించవు(పునరావిష్కరణ).

"ఈ కలయిక ఎక్కడో ఒకచోట ఎడబాటౌతుంది (మృత్యురూపం). వెక్కిరించిన నీ నొసళ్లే నీకు మొక్కులందించే దాకా విసురుగా దూసుకపోతున్నప్పుడే నీ లక్ష్యం గమ్యాన్ని తీసుకొచ్చి పాదాల ముందు నిలుపుతుంది (నువ్వు నువ్వుగా జీవిస్తేనే). మానవ మనస్తత్వాన్ని, దాని నైజాన్ని, భ్రమల్లో బ్రతుకున్న వైనాన్ని, వాస్తవికతను ఓ మనస్తత్వ శాస్త్రవేత్తగా చెప్పిన కవిత మొత్తం సంపుటికి హైలెట్. "ఆ వైపూ ఈ వైపూ ఎగిరిన పక్షి మిడిసి పడుతున్నది. అన్ని దిక్కుల్లో తానే వున్నానని. తెల్లవారి లేచి చూస్తే తెలిసింది తానున్నది జానెడు గూటిలోనే అని. (తిరిగి చూసుకొంటే) ఆకాశహర్మ్యాల కలల్లో పల్టీలు కొడుతున్న నేటి యువతరానికి ఈ కవిత చిరు చురక!

డాక్టర్ సినారె కవితలన్నీ అనుభవైకవేద చిత్రాలు. అందులో జీవితమూ, సూచనలూ, హితోక్తులూ, కవిత్వమూ వుంటాయి. ఎవరికి కావలసింది వారు నిరభ్యంతరంగా తీసుకోవచ్చు. ఫలానా కవిత స్పందనతో అభివృద్ధి చెందానంటే సినారె కవితా లక్ష్యం నెరవేరినట్లే! కవిత్వం సమాజం కోసం అనే సిద్ధాంతం చైతన్యవంతమైనట్లే. అదృష్టవశాత్తు ఆంధ్ర దేశంలో జన్మించి తన కవిత్వం ద్వారా తెలుగు జాతిని జాగృతం చేస్తున్నందుకు మనం తరిస్తున్నాం. ఆయన జన్మధన్యమయింది. ఇలాంటి కవితలు శత సంవత్సరాధిక జీవితాన్ని సినారె గారికి ప్రసాదించాలని సర్వేశ్వరుణ్ని ప్రార్థిస్తున్నాను.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11





నెల్లూరులోని ఐశ్వర్య ప్రింటర్స్ అధినేత పఠాన్ బాబూఖాన్ కుమార్తె ఆషా, రషీద్‌ల నిఖా సెప్టెంబర్ 5తేది సిపిఆర్ కళ్యాణమండపంలో జరిగింది.

# ఆచార్య అరెస్టుకు సిఎం అడ్డు!

ఎమ్మార్ అక్రమాల కేసులో ప్రధాన నింది తుడిగా సిబిఐ పేర్కొన్న బిపి.ఆచార్యను రక్షించడానికి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి స్వయంగా రంగంలో దిగినట్లు తెలుస్తున్నది. ఆచార్య నిజాయితీపరుడైన అధికారి. కానీ వైఎస్ మీద అపారమైన ప్రేమ, నమ్మకం కలగడంతో ఆయన అడిగిన ప్రతి పనీ చేసి పెట్టాడు. అందుకు ప్రతిఫలంగా వైఎస్, జగన్‌లు వేల కోట్లు దోచుకొన్నారు కానీ ఆచార్య మాత్రం ఒక్క పైసా ముట్టలేదట. ఇప్పుడు సిబిఐ కేసు ఆచార్య పీకకు చుట్టుకొన్నది. తనను గట్టెక్కించమని జగన్‌ను, కెవిపి రామచంద్రరావును ప్రాధేయపడ్డాడట ఆచార్య. కానీ వారిద్దరూ పట్టించుకోలేదు. జగన్ అయితే, కనీసం ఇంటర్వ్యూ ఇవ్వడానికి కూడా ఇష్టపడలేదట. మా నాయన చెప్పిన పని చేశానంటున్నావు కాబట్టి, మా నాయన దగ్గరకే వెళ్లి అడగమని తుస్కారంగా మాట్లాడాడట. కెవిపి రామచంద్రరావు దగ్గరా అదే తిరస్కారం ఎదురైంది. నేను అరెస్ట్ అయ్యే పరిస్థితి వస్తే మీ ఇంటి ముందు ఉరి వేసుకొని చస్తానని బెదరించినా ఆయన మౌనంగా వింటూ వుండిపోయాడట. ఆచార్య దీనస్థితి చూసిన తతిమా ఐఎఎస్ అధికారులు జాలిపడి, కిరణ్‌కుమార్‌రెడ్డికి పరిస్థితి నివేదించారు. ఆచార్యను ఏదో ఒక రకంగా కాపాడకపోతే మొత్తం ఐఎఎస్ వ్యవస్థ నైతిక స్థైర్యమే దెబ్బతిని పోతుందని చెప్పారట. దానితో కిరణ్‌కుమార్ రెడ్డి ఢిల్లీలోని పెద్దలతో మాట్లాడి, కేసులో పూర్తి ఆధారాలు దొరికితే తప్ప ఆచార్యను అరెస్టు చేయవద్దని, కొంతకాలం ఆపమని విజ్ఞప్తి చేశాడటే. ఆయన మాట సిబిఐ ఎంతవరకు విన్పించుకొంటుందో తెలియదు.










Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com